చ. అనవుడునుం గుమారసిరియాళుఁడు వీనులు మూసికొంచు నో
యనఘచరిత్ర నీకు నిటు లానతి యీఁ దగు నయ్య నీకుఁ గా
దని పలుకంగ నాకు భయ మయ్యెడు గాక పరార్థ మైతనూఁ
ధనము వ్యయింపఁ గల్గుట కదా జననై కఫలం బెఱింగినన్ 78

గీ. ఎఱుక చాలనివాఁ డందుమే దధీచి, నల్పబుద్ధులె మేఘవాహనుఁడు శిబియు
దరఁ 'బరోపకారార్థ మిదం శరీర', మనెడువాక్యంబు వినవె సంయమివరేణ్య. 79

గీ. అధ్రువం బైనమలభాండ మైనదేహ, మనఘ యన్యోపకారార్థ మైవ్యయించి
ప్రవిమలంబుఁ గల్పాంతరధ్రువము నైన, కీర్తికాయంబుఁ గైకొంట కార్తి యేల. 80

వ అనిన జటాధారిజంగమప్రమథుండు వీఁడు చిఱుతొండనంబికంటె నధికుండు వో మ్మనుచు మరలి పోవువాఁడు వెండియు. 81

గీ కపటమాయామహానాటకప్రపంచ, సూత్రధారుండు చిఱుతొండనుతున కపుడు
మూర్ఛ రప్పించెహరుఁ డందు మోసపోయి, యక్షరాచార్యుఁడును భయమందనలని.

శా నోర న్నుచ్చిలి గ్రమ్మ మై వడఁకఁ గన్ను ల్తారకాబింబసం
చారవ్యాప్తి నధఃకరింప హృదయస్థానంబు గంపింప గ్రీ
వారంధ్రంబున ఘుర్ఘురధ్వనులు తీవ్రస్ఫూర్తి వర్తింపఁగా
సీరాలుండు ధరిత్రిమీఁదఁ బడి మూర్ఛిల్లె న్నిరాలస్యతన్ 83

క. మోహాంధకారధారా, వ్యూహమున సిరాలుసెట్టి యుసు ఱుడుగుటయుఁ జ్
హాహాకారధ్వనితో, లాహల మచ్చోట గురుకులంబునఁ జెలఁగన్. 84

గీ. ప్రణుతపంచాక్షరీమంత్రపాఠశక్తి, ఫాలమున దేశికుఁడు భూతిఁ బ్రాముటయును
గ్రమ్మఱను మూర్ఛ దెలిసె సిరాలసెట్టి, భక్తులకు భస్మమే కదా ప్రాణరక్ష 85

వ. అంత నక్కడ 86

సీ చిఱుతొండఁ డావృద్ధశివయోగిపుంగవుఁ, బ్రబలకుష్ఠవ్యాధిబాధితాంగు
వీఁపు మీఁద ధరించి వెనువెంట గ్రుడ్డవ్వ, కోలూఁదికొని రాఁగఁ సూర్చుకొనుచు
బూదిబొక్క ణలాతమును కమండలువును, బులికళాసముఁ గరంబున వహించి
శరణియు లెదురుగా శరణార్థి సేయుచు, నొయ్యొయ్య సంగడి కోసరిలుచు

గీ. చంద్రశేఖర భూతేశ శర్వ రుద్ర, పార్వతీనాథ శంకర భవ గిరీశ
కాలకంధర హర కాలకాల యనుచు, వచ్చె నింటికి జనకోటి యచ్చెరింప. 87

మ. మహి నూహింపఁగ నెంతభాగ్యమొకొ యామ్నాయాంతసిద్ధాంతవా
ఙ్మహిళాకుంతలమార్తికాభరణముక్ మందాకినీశేఖరుం
గుహనాథైరవు యోగిపుంగవుని భర్గుజ్ రాజమార్గంబునక్
వహియించెం దనవీఁపునం దిరముగా వైశ్యుం డనాలస్యతన్. 88

ఉ. ఇంటికిఁ దెచ్చి యోగిపరమేశునకున్ వణిజుండు తాను వా
ల్గంటియు భక్తియున్ భయము గౌరవము న్వినయంబు నాత్మలో
నంటుకొనంగ నప్డు ముసలమ్మకు సైతము కమ్మనూనె మై
నంటి నలుంగుతో జలక మార్చి యొసంగిరి ధౌతవస్త్రముల్ 89

వ. అనంతరంబ యేకాంతగృహంబున సర్వోపచారసంభారభరితంబుగా దేవతార్చన
కుం బెట్టిన నయ్యాదిమదంపతు లిరువురు శివపూజావ్యాపారంబునం బ్రవర్తిల్లుచుండి
రప్పుడు శివాజ్ఞావశంబునం జేసి '0

ఉ. పల్లియవోటనుండి యెలపాసెము నడ్కులు జక్కిలంబులున్
బెల్లపుటచ్చులున్ సెనగచేడలుఁ జిమ్మిలి నువ్వుటుండలున్
బెల్లుగ నంబివియ్యములు పెద్దతికంబుఁ బ్రియంబు నొప్ప మే
నల్లునకుం గుమారశిరియాలునకుం గొనితెచ్చి రర్మిలిన్ 91

వ. అంత. 92

సీ. ఫాలపట్టికయందు భస్మత్రిపుండ్రంబుఁ, గర్ణంబులను రాగికమ్మదోయి
కరమునం దిత్తడికంబంపుగంటెయు, ఘనకుచంబులమీఁదఁ గావిగంత
కటిమండలంబునఁ గరికంచుఁబుట్టంబు, మడఁచి కట్టినమేలినడిమికట్టు
కేలుఁదామరయందుఁ గేదారవలయంబు, జడకుచ్చుమీఁదఁ బచ్చడపుఁగండ
గీ. సంతరించి పదాఱువర్షములవయసుఁ, బచ్చిబాలెంతరాలు తాపసపురంధ్రి
నంబిభామినిఁ దిరువెంగనాంచిఁ జేరి, వాలుఁగోయింపుఁ డమ్మ పాపనికి ననియె. 93

ఉ. మక్కువ రేఁగి నెయ్యపుఁగుమారునిఁ జంపుట కంతరాయమై
యక్కటికంబు పుట్టుటకు నల్లన వచ్చి భవాని యుత్తటిం
దక్కటిమాయజోగితవిధంబున బిడ్డకుఁ బాలు వేఁడ నా
యక్కయుఁ బోసె నెల్లసమయంబులఁబోలె నిరాకులాత్మ యై. 94

గీ. పాలు వోయించుకొని యాకృపాళుమూర్తి
శూలివాంచారి పాలిండ్లచూచుకములు
పాలచేఁపున గిలిగింత వాఱుటయును
మెత్తమెత్తన నఱచేత నొత్తుకొనుచు. 95

వ. తిరువెంగనాచితో నిట్లనియె. 96

మ. ప్రజ లెల్లం బురిఁ గ్రంతక్రంతల మహాపాపంబుగాఁ బల్కెడున్
నిజమో కల్లయొ కాని మీ రఁట కడున్ నిస్త్రింశభావంబునన్
నిజపుత్త్రున్ సుకుమారుఁ జంపి యొకదుర్నిర్వాణికిం జోగికి
న్భుజియింపంగ నొనర్చువార టిది యొందుం గల్గునే యిద్ధరన్. 97

క. శోగులు కపటోపాయ, ప్రాగల్భ్యంబున నిధానవనసిద్ధులకై
యేగతుల నైనఁ దిరుగుదు, రోగిరముగ సుతునిఁ జంపుటుచితమె మీకున్. 98

గీ. అవగింజంతభూతి పై నలఁదికొనిన, వెలఁది గుమ్మడికాయంతవెట్టి పుట్టుఁ
గటకటా యెట్లు తనబుద్ధి కాటఁ గలియ, నిసువుఁ జంపంగఁదలఁచెనో నీమగండు 99

క. కానందు గాక కన్నులు, దా నేమిటివాఁడు నీదుతనయునిఁ జంపన్
మానవతీ "మగవాఁడో, మానో" యనుమాట నేఁటిమాటయె చెపుమా 100

వ. అనిన దిరువెంగనాంచి యక్కపటపుంజంగమదేవిమాటలు వినక నిర్వికారం బైనయా కారంబుతో నమ్మా శివుఁ డన శివయోగి యన భేదంబు గలదే శరణార్థులయర్థప్రాణంబులు శివాధీనంబులు శివుండు కర్త శివుండు భోక్త యీయర్థంబునకుం జింతింపనేల నీకుం దడవయ్యెడు బాలెంతిరాలవు చన్నులఁ జేఁపుచున్నవి బిడ్డ యింత కొంత యలమటం జెందునో పాలు చాలఁగదా యెప్పుడు మాయింటికి వచ్చుచుం బోవుచుండు నది నిండుకొని యుండు మని కేలుదోయి ఫాలంబునం గీలుకొల్పి సముచితవ్యాపారంబులం బ్రివర్తించు చుండం జంకు గానరాక పార్వతీదేవి కుట నటనుండి చని యంతర్ధానంబు సేసె నాసమయంబున. 101

గీ. చేర నేతెంచి చిఱుతొండసెట్టి యంత, యింతి తిరువెంగనాంచితో నిట్టు లనియె
నొజ్జలగృహంబునకుఁ బోయి యుత్పలాక్షి, వడుగు సేయంగవలెఁ జిన్నవానిఁ దెమ్ము.

చ. చెలువ కుమారుని న్వడుగు సేసి చేతడి యాఱకుండఁగా
జోలఁ పెసలారఁగా నిరుగుపొరుగులవారల భాగ్యసంపదల్
కుఁ మభివృద్ధిఁ జెంద మనకూరిమినందనుఁ బెండ్లి సేయఁగా
వలయు ననంతరత్నుఁ గు వైభవ మొప్పఁగ ము క్తికన్యతోన్ 103

వ. అనిన నామెయు నట్ల కాక యని యాచార్యగృహంబున విద్యాభ్యాసముఁ జేయుచున్నకుమారునిం దోడ్కొని వచ్చినంత 104

ఉ. మంచిగ మేనయత్తలు సమాదరణం బడరంగఁ బెట్టి పు
త్తెంచినమంచిభక్ష్యములు తేనియ నేతిను ముంచి ముంచి భ
క్షించుచు దల్లిఁ దండ్రిఁ దనచిన్నికరాంగుళి వంచి వంచి యూ
రించుచు నిచ్చ మీఱఁగఁ జరించెఁ గుమారకుఁ డింటిముంగిటన్. 105

వ అనంతరంబ 106

సీ. జడలయల్లిక యూడ్చి సంపంగినూనియఁ, బిన్నకూఁకట్లఁ జొబ్బిలఁగ నంటి
గోష్ఠ్యదేశంబు సంకుమదద్రవంబున, నయమార నుద్వర్తనంబు సలిపి
గిసి గొజ్జఁగ నీరుపోసి నూతినకొత్త,చిఱుబంతి పసుపులో చేవ నలఁది
కస్తూరిఁ బొరపినగంధసారంబుతో, నీకాయయొరువున జిడ్డు విడిచి

గీ. తేటవలిపెచ్చనీరునఁ దీర్థమాడి, వేణి యూటార్చి సురపొన్న విరులు ముడిచి
మడుఁగు గట్టి కాటుకయిడి తొడిపి పూసి, భసితరేఖాత్రిపుండ్రంబు నొసటఁ దీర్చి.

వ. కయిసేసి కుమారునిం గనుఁగొని జననీజనకు లిట్లనిరి. 108

ఉ. భైరవయోగి కొక్కనికిఁ బాశుపతవ్రతచర్యతీరునం
బారణకై నిజుం బలలపాకము గా నొనరించి పెట్టుచు
న్నారము భోజనంబు ప్రియనందన నీహృదయంబునందు సం
సారముఁ బాయ జాలనివిచారము లేదు గదా యొకింత యున్ 109

వ. అనినం గుమారశిరియాలుండు 110

శా. సంసారభ్రమ మించు కేని యిను మత్స్వాంతంబునన్ లేదు మీ
వంశం బీపరిపాటిదే యెఱుఁగుఁడీ వైక్లబ్యసంభావనల్
మాంసాహారము లయ్యెదన్ శివునకున్ మాయామహాయోగికిన్
హింసాక్లేశము మానుఁడీ గురులు మీరే మిమ్ముఁ బ్రార్థించెదన్ 111

వ. అని పల్కె నప్పుడు. 112

గీ. చావ నియ్యకొనినసత్పుత్రునకును, జంప నియ్యకొనినదంపతులకుఁ
దారతమ్య మెద్ది వీరమాహేశ్వరా, చారసమయమార్గగౌరవమున 113

వ. ఇవ్విధంబున మువ్వురును జంవనికాపురస్సరంబుగా నేకనిశ్చయు లయిరి తదనంత
రమున 114

సీ. చన్నిచ్చుచాగున జనయిత్రి తొడలపైఁ, బసిబిడ్డఁ బన్వళింపంగఁ బెట్టె
జందనిక తనహస్తప్రణాలంబులు, క్రిందవంటుక సంతరించుకొనియెఁ
జిన్నిబుగ్గల లేఁతచిఱుతనవ్వు వెలగ్వ, శిరియాలుఁడు మొగిడ్చెఁ జేయిదోయి
చిఱుతొండనంబి క్రొమ్మెఱుఁగారుమరకత్తి, వాఁడిగా నూఱుచు వంక దీర్చె

గీ. నేకమై యట్లు మువ్వురిహృదయములును, గుంద కానందవారిధియందుఁ దేలె
గురులు మువ్వురుఁ గుమారవరునితోడ, నేకవాక్యంబుగాఁ బ్రీతి నిట్టు లనిరి

మ. మది శంకింపకు మన్న మావలని ప్రేమస్నేహవాత్సల్యసం
పద వాటింపకు మన్న నాలుకతుదిన్ బంచాక్షరీమంత్రముం
బదిలం బొప్పఁ బరింపు మన్న పరమబ్రహ్మార్థసంసిద్ధి యి
య్యది సు మ్మన్న యనుంగునందన శిరాలా వీరశైవవ్రతా. 116

ఉ. నంబి శివార్థము న్మనసునమ్మిక శంక యొకింతయేని చి
త్తంబునయందు లేక వనితామణియూరువుఁ దాపుఁ జేసి తీ
క్ష్ణం బగుకత్తి మోప మెడ గ్రక్కునఁ ద్రెవ్వి నమశ్శివాయమం
త్రంబుఁ బఠించుచుండెను శిరాలుశిరంబు వసుంధరాస్థలిన్. 117

ఉ. కంపక గాజువాఱక వికారము దప్పక మందహాసని
ష్యందము చెక్కుటద్దముల జాఱక నెమ్మది నిద్రవోవువ
ట్లందము నొందె ధాత్రి శిరియాలకుమారునివక్త్రచంద్రుఁ డా
నందము నొందె నప్పు డెలనాఁగమనంబును భర్తచిత్తమున్. 118

గీ. పన్నిదం బాడి గెలిచినభావ మొప్ప, నప్పు చక్కంగఁ దీర్చినయనువు మెఱయ
సతియుఁ బతియును గారంపుసుతు వధించి, వరుస నడపిరి వీరశైవవ్రతంబు 119

చ. మిరియము నుల్లియుఁ బసుపు మెంతియు నింగువ జీరకంబు శ
ర్కరయును జింతపండును గరాంబువు గమ్మని నేయి తైలముం
బెరుఁగును మేళవించి కడుఁ బెక్కువిధంబులఁ బాకశుద్ధి వం
డిరి శిరియాలునిం గటికిడెందమునం దరళాక్షు లిద్దఱున్. 120

సీ. కమ్మగాఁ గాఁచినకట్టునంజుళ్లను, నీరు వెళ్లఁగ నొత్తి నేత వేఁచి
చక్కఁగాఁ దఱిగినసన్నమాంసంబులు, పరిపాటిమై జుబ్బుఁబడనువండి
మూల్గుటెమ్ములతోడ ముదకగా కుండఁగఁ, జాఁదుసేసిననల్లచారు గాఁచి
వలయుసంబారాలు వడియాలు బలియించి, దళమైనక్రొవ్వుతోఁ దాలఁబోసి

గీ. షడ్రసోపేతములు గాఁగఁ జతురభంగి, నమృతపాకంబులుగఁ జేసి రాక్షణంబ
సెట్టి శిరియాలు వంశాబ్ధిశీతకరుని, సతులు తిరువెంగనాంచియుఁ జందనికయు.

క. నానావిధపాకములుగ, నానాలుగఁ జేసి యపుడు నాల్గువిధములన్
భోనాముదొంతిఁ జేర్చిరి, నూశాస్త్రసమానుఁ డైన సుతు శిరియాలున్. 122

సీ. నిగనిగం గాఁ దోమి నిండుబోనముదొంతి, భోజనశాలలోఁ బొసఁగఁ జేర్చి
చెలువ గొజ్జఁగనీటిచేపట్టు గావించి, పాటించి రత్నకంబళము పఱచి
దేవతార్చకు ధూపదీపాదు లొడఁగూర్చి, కప్పురంబున ముగ్గు గలయఁబెట్టి
యొడమదిక్కున దాగిపడిగెంబు ఘటియించి, గిరగతో విమలోదకములు డించి

గీ. యతిప సర్వాయితం బయ్యె నయ్యగారి, కారగింపంగ నవసరం బనుచుఁ బలుక
సెట్టి తోడ్తెచ్చె జంగమసిద్ధవృద్ధు, నంధురా లగుముదుసలియవ్వతోడ. 123

క. శ్రీపాదంబులు గడిగెను, శ్రీపాదోదకముఁ గొనియెఁ జెలువయుఁ దానున్
వ్యాపారిసార్వభౌముం, డాపరమతపస్వి నునిచి యర్చించెఁ దగన్. 124

వ. అనంతరంబ చిగురు ముదురునుం గాని నిడుపు వెడల్పుం గలకదళీపలాశంబుం డిమి
యూరియఁ బుచ్చి పఱచి యుదకంబునం బ్రక్షాళించి యుపస్తరించి పాయసాపూప
సూపపుండ్రేక్షుద్రాక్షాగోక్షీరమధుశర్కరాఘృతదధిరసావళీశాకపాకశిఖరిపానకంబుల
తోడ గారాపుంగొడుకుపాల మేలోగిరంబులోడం గూడ భరితభోజనంబుగా

వడ్డించి గ్రుడ్డియవ్వకు నైతమట్లనే సమర్పించి దేవ! భక్తవత్సల! శివయోగీశ్వరరూప! విరూపాక్ష! యమృతాహారం బారగించి రక్షింపు మని చిఱుతొండండు భార్యయుం దానును భక్తితాత్పర్యవిశ్వాసపురస్సరంబుగా నమస్కరించిన. 125

ఉ. భైరవయోగి రాజు పసిపాపనినంజుడుఁగూరలందు లో
నారసి చూచి మస్తకమునందలిమాంసము లేమి గాంచి యీ
నీరసమాంస మేటికి వణిగ్వర! పుత్త్రునియుత్తమాంగముం
గూరలు సేయ వైతి వివిగో నిజపుత్త్రనిసర్గమోహముల్. 126

గీ. కటకటా! మావ్రతంబు భగ్నంబుఁ జెందె, నేటిపారణ మిది మాకు నేటి కింక
నుత్తమాంగపుమాంసము నుజ్జగించి, యేల యధమాంగమాంస మే నెటు భుజింతు. 127

వ. అనిన విని చిఱుతొండండు భయంపడి వెలవెలంబాఱుచుఁ దిరువెంగనాంచి వదనం బాలోకించి యింక నెట్లనినం జిట్టమిడుచు నంతఁ దలకాయపాల మేలోగిరంబు ముందటం బెట్టి చందనిక యిది యేను మొదలన బెడందకాం ద్రగుయోగిబృందారకులచందం బెఱింగినదాన నగుటం జేసి పాకంబుఁ జేసికొనియున్నదానఁ దపస్వి చిత్తం బేపాకంబునుం బొందకుండ వడ్డించెదం గా కని యట్లుచేసిన నక్కహానా భైరవుండు వెండియు. 128

గీ. బంతి నీ వారగింపక పరమపుణ్య! నాకుఁ జేయాడు నే భోజనంబు సేయ
నొకఁడు భుజియించు టెన్నఁడు నొప్పదనెదు, వేదవాక్యార్థ మన్నదివినవె చెపుమ.

వ. మఱియు నొక్కభోజననియమంబు కలదు పిన్నవాఁడు బంతిభోజనంబు సేయక కూడు నోటికిం బోదు మగబిడ్డండు లేనినిర్భాగ్యునింట భోజనంబు సేయఁగూడదు నీకుమారు నాబంతికి రప్పింపు మారగించెద మనవుడు. 130

మ. మొదలం దేవర యానతిచ్చితిర యేముం జిత్తమం దెంతు మ
య్యది నాకుంగొడు కింకనుం గలఁడె వాఁ డాడంగ వెంచేసె నే
చదువం బోయెనె పిల్వఁ బంతు నెటు నేజాడం బ్రతీక్షించు నీ
యదనం గూరలు చల్లనారవె మహాత్మా యోగిచూడామణీ! 131

వ. అనిన నత్తపోధనుఁ డిట్లనియె నీయుత్తమాంగన యెలుం గెత్తి నలుదిక్కులం బిలుచు నది కుమారుండు వచ్చె నేని బంతిం బెట్టుకొని భుజింతము రాకుండె నేని నేమును నీముసలియవ్వయుం గుడుత మటు గాక యొఱగొడ్డెంబులు పలికి నీపడ్డపాటు గొడ్డేఱుఁగా జిడ్డుపఱుపం గలవార మె యనినం బ్రసాదం బని పతియనుమతిం బురంధ్రీరత్నంబు. 132

సీ. రారా వణిగ్వంశవారాశిహిమధామ ! రారా వికస్వరాంభోరుహాక్ష !
రారా మహాఘోరవీరశైవాచార ! రారా ఘనౌదార్యరాజరాజ !

రారా కుమారకంఠీరవేంద్రకిశోర ! రారా సమగ్రధీరాహిణేశు !
రారా మనోభవాకారరూపవిలాస ! రారా యసారసంసారదూర
గీ. రార నావన్నెవడుగ ! రారా తనూజ ! రార శిరియాల ! రార నాప్రాణపదమ !
రార నాకుట్టి ! కాజియ్య ! రార యనుచుఁ, జీరెఁ గారాపుఁగొడుకు రాజీవనయన.
శా. అత్తన్వంగి సమస్తదిక్కులను పర్యాయక్రమం బొప్పఁగా
నొత్తెం జిన్నికుమార రార యని యత్యుచ్చైశ్శ్రుతిం జీరినం
జిత్తంబుం గనవచ్చెఁ బాలుఁడు మహాశీఘ్రప్రచారంబునన్
దత్తద్వ్యంజనపాకగంధ్యవయవస్థానప్రతానంబుతోన్. 134
శా రక్షాపాండుర మైనదేహము నహిగ్రైవేయముం గంధరా
కుక్షిం గప్పను బ్రస్ఫురద్ఘనజటాకోటిన్ శశాంకార్ధముం
జక్షుః పద్మముతోడ ఫాలతలమున్ సంధిల్ల శంభుండు ప్ర
త్యక్షుం బయ్యె శిరాలుతండ్రికి హృదాహ్లాదంబు సంధిల్లఁగన్. 135
వ. అప్పుడు భయభక్తితాత్పర్యంబులు మనంబున ముప్పిరిగొన నప్పరమమాహేశ్వరుం
డి ట్లని స్తుతియించె. 136
మ. జయ హాలాహలనీలకంధర మహేశా భక్త చింతామణీ
జయ గంగాధర చంద్రశేఖర జగత్స్వామీ కృపాంభోనిధీ
జయ నీహారధరాధరేంద్రతనయాచారు స్తనద్వంద్వసం
శ్రయసంలగ్నపటీరకుంకుమరజస్సంపన్నబాహాంతరా. 137
వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రస్తుతించె నిట్లు ప్రత్యక్షం బైనవిరూపా
క్షుండు చిఱుతొండనంబి! నీవు తుంబురుండవు శిరియాళుండు కుమారస్వామి
తిరువెంగనాంచి యచ్చర మీరిద్ద ఱొక్కకారణంబున మర్త్యయోనిం జనించి
తిరి మీమీస్థానంబులనుండి తొంటిచందంబున నన్నుం గొలువుండు శరీరంబుల
తోడం గైలాసంబునకు రం డని యనుగ్రహించిన 138
సీ వైశ్యాన్వయంబున వసుధ వర్ణన కెక్కి, వేయిగోత్రంబుల వినుతిఁ గాంచి
వీరమాహేశ్వరాచారంబు వదలక, యేడువాడలవార మేము గలసి
వర్తిల్లుదుము వాసి వట్టు మేమియు లేక, యిట్టిబంధులఁ బాసి యే నొకండ
రా బుద్ధి రాదు తారకరాజశేఖర, యిందఱఁ గొనిపోయి తేని వత్తుఁ
గీ. గూర్చుకొని పోవు నీ కొడఁగూడ దేని,నట్లు గా కున్న విచ్చేయు మభవ మరలి
ప్రమథసన్నిధి కేమియు బాధలేదు, కొలిచెదము నిన్ను మే మెల్లఁ గూడిమాడి. 139
వ అనిన శంభుండు కరుణించి యేడువాడలుఁ గదలివచ్చునది నీకుం బ్రియం బగునివ్వరం
బిచ్చితి నని యానతిచ్చిన తత్క్షణంబ. 140

గీ. కంచిలోఁ బేడువాడలఁ గలిగినట్టి, నాణెపుంగోమటులతోడ నంబిసెట్టి
యఖిలజీవరాసులఁ గూడి యభ్రవీథి, భాసురస్ఫూర్తి నేగెఁ గైలాసమునకు. 141

వ. ఇది కావేరీవల్లభులును నుభయరావలులును కిష్కింధాచలక్రీడావినోదులు నయోధ్యాపురాధీశ్వరులును నగువైశ్యకులంబులవారలకుం గూటస్థుం డయినచిఱుతొండ నంబియుపాఖ్యానము వినినను జదివినను వ్రాసినను బుత్రపౌత్రాభివృద్ధియు ధనకనకవస్తువాహనసమృద్ధియు నిష్టార్థసిద్ధియు నగును 142

ఆశ్వాసాంతము.

శా. చాముండాపరమేశ్వరీవరకృపాసంవర్ధితైశ్వర్యని
స్సీమప్రాభవ లక్ష్మణాగ్రజ సుధాసిక్తాక్షరాలాప యు
త్యామర్దార్జునవీరశైవసమయవ్యాపారపారీణతా
సామాన్యప్రతిభావనిర్వహణదీక్షా శక్వరాధీశ్వరా. 143

క. కర్పకటకాంఘ్రిసేవక, కర్పూరవసంతరాయ కావేరీశా
దర్పితరిపుగర్వతమో, హర్పతిసౌకర్యదక్ష యంబురుహాక్షా. 144

తోటకవృత్తము.— అలకాధిపతీ సుగుణాభిరతీ, మలయోద్భవచంద్రసమానయశా
కులపావన యూరుజగోత్రవరా, లలనాజనతారుణ్యలక్ష్మనిభా. 145

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ శ్రీనాథ నామధేయప్రణీతం బయినహరవిలాసం బనుమహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీరస్తు.

# హరవిలాసము

## తృతీయాశ్వాసము.



పర్వతసోపాన
స్థాపక వేమక్షితీశసామ్రాజ్యశ్రీ
వ్యాపారిముఖ్య యన్వయ
దీపక యలకాధిరాజదేవయతిప్పా! 1

వ. ద్వితీయవిలాసంబైనగౌరీకల్యాణం బాకర్ణింపుము. 2

ఉ. తారకుఁ డన్మహాసురుఁడు తామరసాసనదత్తమైనదు
ర్వారవరానుభావమున వ్రాలి త్రిలోకము నేలుచుండు ని
ష్కారణతీవ్రబాధ ననిశంబును ముప్పదిమూఁడుకోట్లబృం
దారకులన్ మహర్షులఁ బ్రతాపగుణంబున నెచ్చి పాఁతుచున్. 3

గీ. నిరపరాధబాధితు లగునిర్జరులకు, బంధమోక్షంబుఁ గావించు గంధవహుఁడు
సతులపయ్యెద వెడలించి చన్నుఁగవకు, దప్పి సేసియు దైత్యుచిత్తంబు వడసి. 4

మ. ప్రకటస్నేహదశాధురంధరత పర్వంగా నిశీథంబులన్
సకలాంగంబులు నిక్కి దీపకలికాస్తంభంబులై యింద్రుపా
యక చూడామణు లొప్ప రాక్షసునిశుద్ధాంతంబులన్ శేషవా
సుకికర్కోటకతక్షకప్రముఖచక్షుశ్శ్రోత్రబృందారకుల్. 5

గీ. దానవునివీటిలోన మార్తాండు డెండ, యంతమాత్రంబ కాని కాయంగ వెఱచు
నెంతమాత్రము కాసిన నెలమిఁ బొందుఁ, గేళిదీర్ఘికలందుఁ బంకేరుహములు. 6

మ. పటుదిగ్వారణగండమండలలసత్ప్రత్యగ్రదానచ్ఛటా
కటుగంధం బగునీరు చిక్కనివియద్గంగాప్రవాహంబులో
పటిహైమాంబుజనాళముల్ పెఱికి యూడ్వం జేయు దేవాళిచే
నిటు దైతేయుఁడు కేళిదీర్ఘికలలో నిచ్ఛావినోదంబుగన్. 7

గీ. ఐంద్ర మాసుర మాగ్నేయ మైలబిలము, వాయవీయ మైశానంబు వారుణంబు
యామ్యమును మున్నుగాఁ గలయష్టదిశలు, తాన కైకొని కైకోఁ డతండు సురల.

వ. ఇవ్విధంబునఁ దారకాసురుండు కాసరాక్షు తామ్రాక్షు ధూమ్రాక్షు చక్షురోదగ్ర ఖడ్గరోమ బాలబిడాల కాలనేమి ప్రధాననానాబంధుసహాయుం డై పాకశాసన పావక పరేతరాజ పలలాశి పాశి పవన పౌలస్త్య పన్నగాభరణులఁ బరిభవించి నిర్జరులం దర్జించి కిన్నరుల వెన్నుసూచి కింపురుషులఁ జంపి గరుడులఁ బడలుపఱచి గంధర్వుల బంధించి గుహ్యకుల సంహరించి యక్షుల నధిక్షేపించి ఖేచరుల గీటడంచి యచ్చరల హెచ్చు గుందాడి సిద్ధులకు బుద్ధిసెప్పి సాధ్యుల సాధించి, మహారాజికుల రాజసం బుడిపి విద్యాధరుల నధరీకరించి మహాఋషుల నదలించి పితరులఁ బ్రతిబంధించి వసువులఁ బరిమార్చి రుద్రుల కుపద్రవం బాపాదించి విశ్వేదేవతల కనాశ్వాసంబునేసి యనశ్వరం బగునైశ్వర్యంబున నప్రతీపం బగుప్రతాపంబున నవార్యంబగు వీర్యంబున నవక్రంబగుపరాక్రమంబున నస్తోకం బగువివేకంబున నేకాతపత్రంబుగాఁ ద్రిలోకంబు లేలుచున్నకొంతకాలంబునకు. 9

సీ. అనువు దప్పిరి నొచ్చి రలసి రాపద నొంది, రదవద లైరి చీకాకుపడిరి
యంగలార్చిరి విచ్చి రారడిఁ బొందిరి, బ్రమసిరి పాఱిరి పల్లటిలిరి
బెగ్గడిల్లిరి పికాపిక లైరి సొలసిరి, కులకులఁ గూసిరి కుతిలపడిరి
గగ్గులకా డైరి కలఁగి రోటాఱిరి, వెలవెల్ల నైరి నివ్వెఱఁగుపడిరి

గీ. ఁబుసవుసవు లైరి గుజగుజ యైరి డస్సి, రొల్లఁ బోయిరి వెగ్గిరి తల్లడిలిరి
సిగ్గువడి రొచ్చపడిరి యుస్సురుసి యైరి, తారకునిచేత మునులు బృందారకులును.

ఉ. ఇట్టివిధంబునన్ విబుధు లెప్పుడునుం గనుఁగాపులట్లు ము
ప్పెట్టియుఁ జేసిచేసియును వేసరి యింద్రుఁడు మున్నుగాఁగ ది
క్కట్టిటు లున్నమా కనుచు నేగిరి పద్మజుఁ గూర్చి యేగి కూ
పెట్టిరి హస్తముల్ మొగిచి పెద్దయెలుంగునఁ దద్గుణస్తుతుల్. 11

వ. జయ జయ జగన్నాథ! జగజ్జననస్థితిసంహారకర! జంభారిప్రముఖనిఖిలబర్హిర్ముఖశిఖామణీమయూఖమంజరీరంజితపాదపీఠ! జలజాసన! జాహ్నవీప్రముఖసకలతీర్థతీర్థసంపూర్ణస్వర్ణకమండలుధర! జపతపోనిష్ఠాగరిష్ఠమనోధిష్ఠానఋగ్యజుస్సామాథర్వణమయనానానిశ్వాస! హిరణ్యగర్భ! భూర్భువస్సువస్త్రయీశుకీపంజర! నిరంజన! భారతీవిహారసౌధాయమానచతుర్వదన! సనాతన! సనత్కుమారజనక! శతానంద! శాశ్వత! విశ్వతోముఖ! నిర్వికల్ప! నిరీహ! నిరాకార! ఓంకారగమ్య! అదిగ్దేశకాలవ్యవచ్ఛేదనీయ! ఆదిమధ్యాంతశూన్య! అవ్యయ! అవాప్తసకలకామ్య! అనంత! అద్వితీయ! నిరస్తసమస్తోపాధికసచ్చిదానందస్వరూప! నమస్తే నమస్తే నమః. 12

గీ. నీదునిట్టూర్పుగాడ్పులు నిగమపఙ్క్తి, ప్రణవమంత్రాక్షరము నీకు భద్రపీఠి
విలయకాలంబు నీనిద్ర విశ్వమునకు, నీప్రబోధంబ యుదయంబు నిఖిలమునకు. 13

గీ. అవధరింపుము విన్నపం బాదిపురుష! యవధరింపుము మమ్ము లోకాధినాథ!
తడవు సేయక రక్షింపు తమ్మిచూలి! తారకుఁడు మమ్ము పెక్కుదుర్దశలఁ బెట్టు. 14

చ. పడితిమి కుక్కలంబడనిపాటులు దుర్భర మైనవృత్తి వె
న్బడితిమి గర్భయాచకులభంగి దరిద్రత నట్టుకొంచు లోఁ
బడితిమి పాలలోఁ బడినబల్లులకైవడి నెల్లవెంటలం
జెడితిమి వేయునేల సరసీరుహసంభవ! దుష్టదైత్యుచేన్. 15

గీ. తారకుం డెవ్విధంబున ధ్వంస మొందు, నెట్లు బ్రదుకుదు మేము మా కేది దిక్కు
చిత్తగింపుము దేవ! సంశ్రితజనార్తి, హరణపారీణ! కరుణారసార్ద్రహృదయ! 16

వ. అని కరుణంబుగా విన్నవించిన హిరణ్యగర్భుండు ప్రసన్నుం డై బృందారకులను
మహర్షులనుం గనుంగొని యిట్లనియె 17

సీ. వెఱవకుం డింద్రాదివిబుధపుంగవులును, శాండిల్యభృగ్వాదిసంయములును
నస్మద్వరప్రభావానుభావంబున, వాఁడింతవాఁ డయ్యె వాఁడి మిగిలి
విషవృక్ష మేనియు వృద్ధిఁ బొందఁగఁ జేసి, త్రుంపఁ గాఁ బెఱుకుట తగవు గాదు
పార్వతీదేవికి భవున కుద్భవ మైన, తేజంబు వాని మర్దింపఁ గలదు

గీ. తండ్రి యగుదక్షుమీఁది క్రోధంబువలన, యోగనిర్ముక్తదేహ యై యుద్భవించి
పెరుఁగుచున్నది హిమభూమిధరగృహమున, నమ్మహాదేవి శివుఁ గూర్పఁ డను వెఱింగి.

వ. ఇంతనుండియు మీకు మేలయ్యెడుఁ బొండని పురందరాదిబృందారకుల వీడుకొల్పి
శతానందుండు యథోచితవ్యాపారంబులం బ్రవర్తిల్లుచుండె నిట్లు దేవతలు భావి
శుభసూచకంబు లగుగంధవాహాదినానానిమిత్తంబు లనుసంధించుచు నిజస్థానంబుల
కరిగిరి యనంతరంబున 19

సీ. అటమున్న దక్షుకన్యక తండ్రితో నల్గి, యోగమార్గమున మే నుజ్జగించి
యపరజన్మంబున నజ్ఞాతయోని యై, యోషధులకు నెల్ల నునికిపట్టు
మేరుమందరవింధ్యపారియాత్రాదిసు, ప్రథితాద్రిసంబంధబాంధవంబు
నైననీహారశైలాధినాథునకును, పితృదేవతలకన్నబిడ్డ యైన

గీ. మేనకాదేవి కుదయించె మేలువేడ్క, నబ్ధిచెలికాఁడు మైనాకుఁ డన్న గాఁగ
నభిజనాఖ్య పార్వతి యన నఖిలజనని, యాదిశక్తి పురారియర్ధాంగలక్ష్మి 20

క. పావనజంగమభువనకు, భావహ మై విశదశదిశాంతర మై యీ
దేవి యుదయంబు నొందిన, యావేళం గుసుమవర్ష మంతటఁ గురిసెన్. 21

గీ. జనని విద్యుల్లతాఖ్య మాచాయ గలిగి, క్రొత్త యుదయించినట్టియాకూఁతువలనఁ
గారుకాలంబుమణిశిలాకరమును బోలె. నొప్పెదువిమారభామిని యుద్ది యయ్యె. 22

వ. అనంతరంబ ప్రతిదినవర్ధమాన యై లబ్ధోదయ యగుచంద్రరేఖయుంబోలె బంధుజనంబులకుఁ బ్రమోదంబు నందించుచు మందాకినీసైకతవేదికాస్థలంబులఁ గందుకక్రీడ సల్పుచు నుపదేశకాలంబుల విద్యలు నేర్చుచు బాల్యంబుఁ గడపి నేత్రోన్మీలనంబు సేసిన చిత్రంబునంబోలె యౌవనవిభక్తం బై యభ్యుదయం బై యభ్యున్నతాంగుష్ఠనఖప్రభావిక్షేపంబున రాగంబు వెడలం గ్రక్కునవియుం బోనిచరణప్రవాళంబులు వృత్తానుపూర్వంబు లై యనతిదీర్ఘంబు లగుజంఘాప్రకాండంబులును వేదండశుండాదండంబులకు వైదండికంబు లై యొప్పారునూరువులును మేఖలాకలాపమధ్యకీలితమహేంద్రనీలమాణిక్యకిరణరేఖయుంబోలె నాభిరంధ్రంబునం బుట్టి మీఁదికి నిగుడ రాజిల్లురోమరాజియును నవయౌవనారోహణార్థంబు మన్మథుం డొనర్చిన మణిసోపానంబులంబోనివళీవిభంగంబులును గుదుళ్లు నిండఁ బలుకం బండినమారేడుపండ్లగారామఁ జెలఁచుగబ్బిగుబ్బలబెడంగులును నభినవశిరీషకుసుమసుకుమారంబు లగు బాహువులును ధర్మబంధురం బగుకంధరంబును సంపూర్ణపూర్ణిమాచంద్రబింబంబుడంబు విడంబింపం జూచునాననంబును గావి యగుమోవియును నూఁబూవువంటి నాసికయు నిద్దంపుటద్దములకుఁ దోడిముద్దు లగుముద్దుచెక్కులును సుమకోదండవల్లీమతల్లు లగుకటివంకబొమలును విదియనాఁటిచందురునకుం గదిసి చుట్టం బగులలాటపట్టంబును గొదమతుమ్మెదచాలుఁ బురుడింపం జాలునీలాలకంబులును నొప్ప సర్వోపమాద్రవ్యసముచ్చయం బగుసౌందర్యంబు నేకత్రావస్థానదిదృక్షుచే విరించి సూత్రీకరించి యుత్థాప్రదేశనివేశితంబుగ నొనర్చెనో యనం దల్లిదండ్రులకు నామోదంబు నాపాదించుచుండ నొక్కనాఁడు నారదుండు సనుదెంచి 23

క. త్రిభువనమోహన యగున, య్యిభగమనం జూచి పర్వతేశ్వరునిమహా
సభలో నిట్లని పలికెను, శుభవచనప్రౌఢి మెఱయ సురముని యెలమిన్. 24

సీ. ఈనీరజాతాక్షి మేనిలో సగపాలు, గణుతింప మొగపాలు గాఁగ నున్న
దీపల్లవాధరిశ్రీపాదపద్మంబు, నొరయు నొక్కొక్కమాటుడుగణేశుఁ
డీకాంతతోడ మందాకినీవాహిని, సవతి గాఁ గల దేమిచందమునను
నీలతాతన్వికి నీరేడులోకంబు, లభిరామకేళిహర్మ్యంబు లగును
గీ. నిండువేడుకఁ గాంచు నీనీలవేణి, కొమ్ముటేనుంగుమొగ మైనకొడుకుఁగుఱ్ఱ
నత్తయును మామయును లేనిరిత్తయింట, మనవు మనిపెడు నీయింతి మగనితోడ. 25.

ఉ. మాటలు వేయు నేమిటికి మంగళలక్షణలక్ష్మి యైనయీ
జోటికి భర్త కాఁ గలఁడు సోమకిరీటుఁడు సర్వదేవతా

కోటికిరీటకోటిపరికుంచితదివ్యమణిద్యుతిచ్ఛటా
పాటలపాదపీఠుఁ డగుపట్టి కృతార్థుఁడ వైతి భూధరా. 26

వ. అనిచెప్పి నారదమునియు నంతనుండి హిమవంతుండు నివృత్తాన్యవరాభిలాషుండై యయ్యోషారత్నంబు శేషభూషణునకు నీ నిశ్చయించియు నభ్యర్థనాభంగభయంబునం జేసి. 27

క. తన్నడుగ రానిశివునకుఁ, గన్నియ నెట్లిత్తు నతనికారుణ్యము నా
కెన్నఁడు సిద్ధించునో యని, యన్నగపతి యాత్మఁ దలఁచె నౌత్సుక్యంబున్. 28

వ. అంత విరూపాక్షుండు దక్షరోషంబు కారణంబు గా దాక్షాయణి శరీరమోక్షంబుఁ జేసినది మొదలు గా సర్వసంగపరిత్యాగంబుఁ గావించి యపరిగ్రహుం డై. 29

సీ. గంగాప్రవాహసంక్షాళితాభ్యున్నత, రుద్రాక్షదేవదారుద్రుమంబుఁ
గస్తూరికాకురంగజనాభిపరిమళ, శ్లాఘ్యేందుకాంతపాషాణతలముఁ
గిన్నరద్వంద్వసంభిన్నపంచమరాగ, నిర్యన్మహావేగనిర్ఝరాంబు
పతితప్రతిధ్వానభంగోరుఘుమఘుమ, ఘుమఘుమాయతదిశాగోళకంబు

గీ. నైనహిమశైలపాదంబునందు నియతిఁ, దపముసేయంగ మదిలోనఁ దలఁచి విడిసెఁ
బ్రమథవర్గంబుఁ దానును బసవఁ డపుడు, కృత్తివాసుండు విషయనివృత్తుఁడగుచు.30

గీ. ప్రమథు లెల్లరు విడిసి రప్పర్వతమునఁ, జంద్రకాంతశిలామణిస్థలములందు
నమరియుండునమేరువృక్షములనీడ, భూర్జతరుచర్మపరిధానములు ధరించి. 31

చ. బసవఁడు ఱంకె వైచి హిమపర్వతసానువనాంతరంబులం
బసిరిక మేసి నిర్ఝరులఁ బాఱెడుతియ్యనినీరు గ్రోలి క్రొ
వ్వొసఁగ ఘనాఘనధ్వనుల నుల్లస మాడెడుఁ దత్పురంబునన్
బ్రసభగతిన్ మృగేంద్రములు భద్రగజంబులు భీతిఁ జెందగన్. 32

గీ. ఆత్మమూర్త్యంతరం బైనయగ్నిదేవు, నర్చనము సేసి నియతి నయ్యష్టమూర్తి
బహుతపోవ్రతనియమైకఫలవిధాత, తలఁపుఁ జేసెను మది నొక్కతలఁపుఁ జేసి 33

గీ. అపుడు హిమవన్నగేంద్రుఁ డత్యాదరమున, నతిథి యై యున్నశంభున కర్చ లిచ్చి
తత్సమారాధనక్రియార్థమునఁ బంచె, నిజతనూజ నజినసమన్వితము గాఁగ. 34

క. రమణి తపోవ్రతచర్యా, సమధికవిఘ్నంబ యనుచుఁ దలపోసియు శీ
✓ ఘ్రము గైకొనె శివుఁడు వికా, రము లేక మదిం దపంబు రమణీమణియున్. 35

సీ. పాటించుపువ్వులు పల్లవంబులు గోయుఁ, గుశపవిత్రంబులుఁ గూడఁబెట్టు
నాపగ రప్పించి మీఁఱు నర్ఘ్యోదకములును, నుపకరణంబులు నొయ్యఁ జేర్చు
వేదికాసమ్మార్జవిధి నివర్తించును, లీలమై రంగవల్లిక లొనర్చుఁ
గల్పించు లెస్సగా గంధాక్షతంబు, లుత్పాదించు ధూపదీపాదికములు

గీ. ప్రత్యహంబును హిమధరరాజతనయ, భవునిపదపద్మములమీఁద భక్తి గలిగి
తచ్ఛిరశ్చంద్రచంద్రికాస్తబకశైత్య, కాంతిపర్యటనక్రియాశ్రాంతి యగుచు. 36

వ. అక్కాలంబునం దొక్కనాఁడు స్వర్గలోకంబునఁ బాకశాసనుండు కల్పానోకహంబులనీడలఁ జింతామణివేదికాస్థలంబులందు బృందారకులు పరివేష్టింపఁ బేరోలగంబుండి దివిజకార్యార్థసంసిద్ధిఁ బొంద మనంబునందుఁ గందర్పునిం దలంచిన. 37

సీ. కాంతాజనంబుల కటివంకబొమలతోఁ, బ్రతివచ్చు పుష్పచాపంబుతోడఁ
గోకిలవ్రాతంబు గ్రుక్కిళ్లు మ్రింగించు, క్రొమ్మావి చిగురాకుఁ గొడుగుతోడ
రతిదేవినిడుసోగఁ గ్రాలుకన్నులడాలుఁ, దలపించు మీనకేతనముతోడ
భుజగలీలావతీభుక్తశేషము లైన, గంధవాహకిశోరకములతోడఁ

గీ. జందురునితోఁ వసంతమాసంబుతోడ, రాజకీరరథం బెక్కి ప్రాభవమున
వచ్చె వలరాజు చిత్తానువర్తనముగ, సంభ్రమముతో మహేంద్రునాస్థానమునకు. 38

ఉ. పక్షము పెంపునం గుసుమబాణునిమీఁద నివ్రాలె దేవశా
ధ్యక్షునివేయికన్నులును దక్కనవేల్పుల నుజ్జగించి యా
త్మేక్షికఁ జూడఁ గార్యగతి యిట్టిదయౌ ప్రభువుల్ ప్రయోజనా
పేక్ష నొకప్పు డాశ్రితులపేర సమంచిత గౌరవోన్నతుల్. 39

క. రా యిటు రమ్మని చేతికిఁ, జే యిచ్చి ప్రమోదరేఖ చిగురొత్త మరు
న్నాయకుఁడు నిల్పె సుమన, స్సాయకు సరిగద్దెమీఁద సౌహార్దమునన్. 40

వ. అప్పుడు. 41

గీ పతిప్రసాదంబుఁ దనమౌళిపై ధరించి, మహితవినయావనమ్రుఁ డై మన్మథుండు
సంగతంబుగ హస్తాంబుజములు మోడ్చి, విస్ఫురోక్తుల నిట్లని విన్నవించె. 42

వ. దేవర నన్నుఁ దలంపున నవధరించిన కారణం బేమి యానతిమ్ము. 43

సీ. ఎవ్వండు నీపదం బెలమి నుద్దేశించి, యతిఘోర మగుతపం బాచరించె
నెవ్వండు నీచిత్త మెరియించుచున్నాఁడు, కైవల్యపదవికిఁ గాలుసాఁచి
యెవ్వండు గురునీతి కేపాకమును బొంద, నుద్దండరీతి మాఱొడ్డి నిలిచె
నెవ్వండు దంభోళిహేతినిర్ఘరధారఁ, దలఁచె నీలోత్పలధారఁ గాఁగ

గీ వాని భంజింతు నాతనిమాన మడఁతు, నతని నిర్జింతు నాతని వశకరింతు
నానతిమ్ము మహేంద్ర నా యట్టిహితుఁడు, నీకుఁ గలుగ నసాధ్యంబు నెగడు నెందు.

గీ. ఏకభర్తృవ్రతస్థ యై యేలతాంగి, నీకుఁ జేయూఁతధర్మంబు నిలువరించె
నది వినిర్ముక్తలజ్జ యై యమరరాజుఁ, జేరుఁ గాత స్వయంగ్రహాశ్లేషణంబు. 45

గీ. ప్రణయకోపప్రశాంతికై పాదపతితు, నిన్ను నేపువుఁబోఁడి మన్నింప దయ్యె

నాలతొంగిఁ బ్రవాళశయ్యాశరణ్య, దేహఁ గావింతు విడువు సందేహ మింద్ర.

క. నీవజ్రము సుఖముండుం, గావుత దివ్యాప్సరఃకాలికామధ్యమునన్
దేవేంద్ర, చెఱకువింటం, బూవులు శరములుగ నే రిపుల నిర్జింతున్. 47

వ. నీప్రసాదంబున మలయానిలంబు ప్రాపును వసంతంబు సహాయంబును నిండువెన్నెల చెలిమియుం గలుగఁ బినాకపాణి యగుహరు నైన జయింపం జాలుదు నని తలంతుం దక్కనవారు నా కెవ్వరు నెంత యని యుత్సాహంబునం బల్కినం బురందరుండు సంకల్పితార్థంబు సఫలం బయ్యె నని యంతరంగంబున సంతోషించుచుఁ గంతున కిట్లనియె. 48

సీ. సంకల్పసంభవ సమకూర్తు వట్లనే, యరుగంగ నీ కసాధ్యంబు గలదె
యటుకాని కాని మహాకార్యభరమునం, దేము నియోగింతు మిపుడు నిన్ను
ధరణిభారధురీణతాప్రౌఢి కని కదా, తను మోఁచు శేషునిఁ బనిచెను హరి
విబుధకార్యార్థంబు విశ్వేశ్వరు గుఱించి, యరుగంగవలయు నీ వధికభక్తి

గీ. కుధరకన్యను శశిమౌళిఁ గూర్పవలయుఁ, బార్వతీపరమేశ్వర ప్రభవ మైన
దివ్యతేజంబు సేనాపతిత్వమొంది, జయముఁ గావించు నని చెప్పె జలజభవుఁడు. 49

వ. హిమాద్రిపాదంబున దేవదారువనంబున నియతాత్ముఁ డై పరబ్రహ్మానుసంధానంబు సేయుచు నంధకారాతి తపంబు సేయుచున్నవాఁడు పార్వతియు హిమవన్నియోగంబున నీశ్వరునకుం బాయక పరిచర్య సేయుచున్న యది యీవార్త సకలలోకవృత్తాంతవిజ్ఞానార్థంబు పంపిన యప్సరస్త్రీవర్గంబువలన నెఱింగితి నిది కార్యక్రమంబు.

గీ. ఇది యనన్యసాధారణ మిది యవశ్య, మిది పరోపకృతిక్రియాభ్యుదయశాలి
చేయు మిప్పని సంకల్పసిద్ధి గాఁగ, బాహువిక్రమపారీణ పంచబాణ. 51

గీ. కోరి యభ్యర్థనము సేయువారు సురలు, కార్య మూహింప మూఁడులోకమ్ములకును
నతిశుభము కృత్యమో యల్ప మైనఁ గాదు, కామసంస్పృహణీయవిక్రముఁడ వీవు. 52

వ. హుతాశనునకు సమీరంబుంబలె మధుమాసంబు సహాయం బగుం గాత మర్థలాభంబును సేమంబును బునర్దర్శనంబు నయ్యెడు మని దీవించిన దేవేంద్రునియానతి ముత్యాలసేసంబోలె శిరంబునఁ దాల్చి యైరావణకుంభికుంభాస్ఫాలనకర్కశం బగుకరంబున వాస్తోష్పతి తన్ను సంస్పర్శించి గౌరవించిన మన్మథుండు మధుసహాయుం డై హిమవత్పర్వతంబు సేరం జనియె నాసమయంబునందు. 53

చ. సకలవనంబులందుఁ గలసంయమికోటి తపస్సమాధిని
ష్ఠకుఁ బ్రతికూలవర్తి యయి షట్పదకోకిలరాజకీరజా
లకములతోడఁ గూడ ఝషలాంఛను నెచ్చెలికాఁడు వచ్చె వాఁ
రక మధుమాసరాజు నవరాగసమంచితపల్లవాస్త్రుఁ డై 54

గీ. ఉత్తరాభిముఖుం డైనయుష్ణరశ్మి, చంద మీక్షించి దక్షిణాశాపురంధ్రి
గంధవాహంబు దీర్ఘదీర్ఘంబు గాఁగఁ, జాఁగ విడిచెను విరహనిశ్వాసధార. 55

శా. ఆమూలాగ్రమశోకపాదపము ప్రత్యగ్రప్రవాళావళి
వ్యామిశ్రంబుగఁ బూచె నప్పు డటు నీహారాద్రికుంజంబునన్
భామాకోమలపాదపంకరుహసంపర్కం బపేక్షింప క
ద్దామం బైనవసంతజృంభణము సత్వం బొప్ప దీపింపఁగన్. 56

గీ. చివురుగఱితోడ లేమావిపువ్వులు శరముఁ, జేసి మధుమాసకాలంబు చిత్తజునకు
నళికులంబులపేర నామాక్షరములు, వరుసతో నిల్పె ననఁ బొల్చె వానియందు. 57

క. నవకము లగుములు మోదువుఁ, బువుమొగ్గలు విపినవీథిఁ బొల్పెసలారెన్
దివుట వసంతుం డనుప, ల్లవుఁ డిడినఖక్షతంబులను సరి యగుచున్. 58

గీ. చెమట కింపురుషస్త్రీలచెక్కులందుఁ, గ్రమ్మి మృగనాభిపత్రభంగంబుఁ గరఁచెఁ
జందనద్రవ మింపయ్యెఁ జన్నుఁగవకు, నలరుఁబన్నీటితో గుహ్యకాంగనలకు. 59

వ. అప్పుడు వనౌకసు లగుతాపసు లప్రతియత్నసంస్తంభితక్రియారంభులును మదనుండు సమారోపితపుష్పచాపుఁడును మధుకరంబులు కుసుమపాత్రపరిపూర్ణమధురసగండూషసముపలాలితప్రియాసందోహంబులును మృగంబులు మృగీకండూయనపరాయణంబులును నై యుండిరి వెండియు. 60

ఉ. పంకజరేణుగంధి యగుపల్వలవారిఁ గరేణు విచ్చె ని
శ్శంక మదావళంబునకు గంధగజంబును బద్మినీమృణా
లాంకుర మర్ధభుక్తము నిజాంగనకుం బ్రియ మారనిచ్చె నా
వంకఁ దపోధనుల్ హృదయవత్సలతన్ బ్రియ మంది చూడఁగన్. 61

ఉ. దేశికగానిమార్గములఁ దిన్ననిరీతులఁ బాడిపాడి యా
శ్వాసము నొంది సోలి యరవాడినయంగనమోముఁ దమ్మిఁ బు
ష్పాసవఘూర్ణితేక్షణము లల్లనఁ జుంబన మాచరించి యు
ల్లాస మొనర్చెఁ గిన్నరవిలాసి హిమాచలకందరంబునన్. 62

గీ. అచ్చరలు పాడుహిందోళ మాలకించి, యిందుమౌళిప్రసంఖ్యాన మెడల దయ్యె
నిర్జితేంద్రియు లైనట్టినియమపరుల, నంతరాయంబు లేమిసేయంగఁ గలవు 63

వ. అప్పుడు వామప్రకోష్ఠార్పితహైమవేత్రకుం డగునందికేశ్వరుం డభినవవసంతసమయారంభసంభూతమనోవికారంబు లగుప్రమథవీరులభావంబులు భావించిహుంకారంబు సేసి మాను మని యదల్చిన నాశిలానందనుదివ్యశాసనంబునఁ గాననం బెల్ల నిష్కంప వృక్షంబును నిభృతద్విరేఫంబును మూకాండజంబును బ్రశాంతమృగప్రచారంబు నై

బా

చిత్రార్పితావస్థానంబునుంబోలె నుండె నేనియును మనోభవుండు ముక్కంటియెదురఁ
జక్కటి గానియొకపక్కియఁ గాఁ బురశ్చక్రంబు నడచువాఁడునుంబోలె మనంబునం
జంకుచు నెట్టకేలకు నాజగజెట్టితపంబు సేయుచలికొండచట్టుపట్టునకుం జనుదెంచి
చుట్టునుం దిరిగి యున్నసురపొన్నమోకల నీడ నిల్చి యచ్చోట శార్దూలచర్మంబునం
బర్యంకబంధబంధురితపూర్వకాయుండును నుత్తానపాణియుఁ బ్రాణాయామపరుండును
నగు నమ్మహాదేవునిపార్శ్వంబునం బుష్పాంజలి వట్టి ధ్యానావసానావసరముం బ్రతీ
క్షించుచుఁ గించిద్విలంబమానకేసరచ్ఛదాభిరామకాంచీకలాపయుఁ గర్ణికారకుసుమ
తాటంకయుఁ బల్లవావతంసయును నగుపార్వతిం గనుంగొని యిదియ నాకవసరం బని
యధిజ్యశరాసనుం డై. 64

సీ. వెలుదకెం జడకొప్పు వదలి వీడకయుండఁ, బెనుపాఁపతలపాగ బిగియఁజుట్టి
మెడకప్పుతోఁ గూడి మిక్కిలి నలు పైన, కమనీయకృష్ణాజినము ధరించి
భ్రూవికారము లేనిపాడవుఱెప్పలలోని, ఘనదృష్టి నాసికాగ్రమున నిల్పి
యోగపట్టికఁ జెంది యొఱపైన నిలుకడ, నాసనస్థితిబంధ మనువుపఱచి

గీ. నిస్తరంగక మైనమున్నీరువోలె, గర్జితము లేనిఘనఘనాఘనము వోలె
ధ్యాననిశ్చలుఁ డగునిందుధరునిఁ జూచి, ప్రసవనారాచుఁ డతిభయభ్రాంతుఁ డగుచు.

ఉ. ఒయ్యన డాయఁగాఁ జనియె నుగ్రవిలోచనుపార్శ్వభూమికిం
దయ్యము ఱేఁడు నెచ్చెలి యొదన్ భయకంపము నుప్పతిల్లఁగాఁ
దియ్యనివిల్లుఁ బువ్వములఁ దీర్చినయమ్ములు శౌర్యసంపదల్
వియ్యము గాఁగ భూమిఁ బడ వైచె నిలింపులు చూచి బెగ్గిలన్. 66

క. స్థావరరాజతనూభవ, యావేళన డాయవచ్చె నభవునిసేవా
హేవాకప్రౌఢిని వన, దేవత లెంతయు గభీరగతిఁ దనుఁ గొలువన్. 67

గీ. పద్మరాగవిభూషణప్రతతిమ యు, లలి నశోకలతాప్రవాళములు దాల్చి
సిందువారప్రసూనరాజీవరాజిఁ, గమ్రమౌక్తికరత్నశృంగార యగుచు. 68

చ. చనుఁగవ వ్రేఁగున న్నిగులసన్నపుఁగౌ నసియాడఁ గెంపు మీ
ఱిన నునుఁబట్టుఁజేలఁ గటి ఱెంగులు వాఱఁగఁ గట్టి భూమిభృ
త్తనయ ప్రసూనగుచ్ఛములు దాలిచి లేఁజిగురుల్ ధరించి వ
చ్చిన నడదీవవోలె నిలిచెం దరుణేందుకిరీటుసన్నిధిన్. 69

గీ. తరుణి యందందఁ గేసరదామకాంచి, జఘనపులినంబు నందుండి జాఱిపడఁగ
మాటిమాటికి హస్తపద్మముల నెత్తు, చచలభావంబుతో నుండె నభవుమ్రోల. 70

ఉ. కమ్మనియూర్పుగాడుపుల గందముఁ గ్రోలఁగ వచ్చి యోష్ఠబిం
బమ్ముసమీపదేశమునఁ బాయక యాడెడుతేఁటిఁ గేలిప

ద్మష్మున మాటిమాటికి సమంచితవిభ్రమలోలదృష్టి యై
యమ్మదిరాక్షి చిమ్ము దరహాసవికస్వరగండపాళి యై. 71

గీ. అఖిలలక్షణసంపూర్ణ యైనయట్టి, యాలతాతన్విఁ జూచి పుష్పాయుధుండు
రమణఁదాఁబూను దేవతారాధనంబు, సఫలతం జెందె నని చాల సంతసిల్లె. 72

ఉ. అప్పుడు డాయ వచ్చెఁ దరుణాబ్జకళాధరు గౌరి భక్తితో
నప్పుడు డాసె నీశ్వరుఁడు నంచితయోగసమాధినిష్ఠమైఁ
దప్పక బాహ్యసీమఁ బ్రమదం బెసఁగం బరమంబు సోహమై
యొప్పెడుదివ్యతేజము సముజ్జ్వలకోటితటిత్ప్రకాశమున్. 73

క. అసమభయభక్తు లలరఁగఁ, గుసుమంబులు దోయిలించి కోమలి నించెం
గిసలయభంగంబులతోఁ, నసమునదుము వణఁక మృదునియడుగులమీఁదన్ 74

ఉ. పల్లవపుష్పభంగములు పాదసరోరుహయుగ్మకంబుపైఁ
జల్లి శ్రవోవతంస మగుసంపగిమొగ్గ యొకింత జాఱఁగా
నల్లన మ్రొక్కెఁ బార్వతి భయంబును భక్తియు సంభ్రమంబు సం
ధిల్లఁగ భర్తకున్ ఘనఫణిప్రభుహారున కంధకారికిన్. 75

క. సరిలేనిమగనిఁ బడయుము, తరుణీ యని పల్కెఁ శివుఁడు తథ్యమ యిది యీ
శ్వరభాషితమునకుం దర, తరములయందైన నన్యథాత్వము గలదే. 76

ఉ. పంచశరుండుఁ దత్పరత బాణవిమోక్షణకాలముం బ్రతీ
క్షించుచు గౌరి శంకరునిఁ జేరినయప్పటినుండి యొప్పుడున్
నించునొకో హరుండు తరుణీమణి నంచును వింట నారి సా
రించుచు నుండెఁ జెంత నురరీకృతదైవతకార్యధుర్యుఁడై. 77

గీ. ప్రియము శోభిల్లఁగా సమర్పించె గౌరి, పసనిపయ్యెద జాఱ దోఁగపల్లవమున
భానుదీప్తులు నీటారి ప్రన్నవైన, పృథులమందాకినీపద్మబీజమాల. 78

గీ. అంబుజాక్షి సమర్పింప నాదరమున, నక్షమాల్యంబు నిటలాక్షుఁ డందుకొనియెఁ
బంచబాణుండు సంధించె నింమవింట, నస్త్రరాజంబు సమ్మోహనాశుగంబు. 79

మ. శమనారాతి నివృత్తధైర్యుఁ డగుచుం జంద్రోదయారంభకా
లమునం బొంగిన దుగ్ధసాగరములీలం బక్వబింబాధరో
ష్ఠముఁ గర్ణాంతవిశాలనేత్రము నతిస్వచ్ఛంబునై యొప్పు గౌ
రిముఖాంభోజమునందు నిల్పె సరసప్రేమంబునం జూడ్కులన్. 80

గీ. శైలసుతయును భావంబుకీలు దెలిసి, యంగకంబులఁ బులకంబు లంకురింప
వ్రాల్చె నిమ్మోము లజ్జాభరంబుపేర్మిఁ, గేకరాలోకనంబులఁ గెల్లుమలఁగి. 81

వ. అనంతరం బంతకమథనుం డతిరిక్తకోపాతిశయం బైనయింద్రియక్షోభంబు బలాత్కారంబు గా గుదియించినచేతోవికారంబునకుం గారణంబుఁ దెలియం దలంచి దిశాంచలంబు లకుం జూపు వఱపునప్పుడు కట్టెదుర దక్షిణాపాంగవినిష్టముష్టియు నానతాంగుండును నాకుంచితసవ్యపాదుండునుం జక్రీకృతకార్ముకుండును బ్రహారోద్యుక్తుండును నైన మన్మథునిం గనుంగొని తపఃపరామర్శపివృద్ధక్రోధుండయ్యె నవ్వేళ భ్రూభంగదుష్ప్రే క్షుం బగువిరూపాక్షునిలలాటేక్షణంబునం జనియించినసముజ్జ్వలజ్వాలాజాలం బైన కృపీటయోని భువనంబులెల్ల భయభ్రాంతంబులై హాహాకారంబులు సేయ నమ్మీనకేత నుకరశరాసనతూణీరంబులతోడం గూడ భస్మంబు చేసిన. 82

సీ. నాగభూషణుఫాలనయనానలముచేతఁ, బంచబాణుఁడు బిట్టు భస్మమయ్యెఁ
బ్రబలాభిషంగసంప్రభవమోహంబునఁ, గేళిని యువళ యై వ్రాలె ధరణి
యువతిసంసర్గంబు యోగవిఘ్నం బని, యభవుఁ డంతర్ధాన మాచరించెఁ
జెలికాఁడు తనమ్రోల నొనికి బూడిద యైన, నామని యేడ్చె నా వఱదినట్లు
గీ. గౌరి తనచారుసౌభాగ్యగౌరవంబు, విలువ పోయినచెలువున విన్నవోయెఁ
బర్వతేంద్రుండు నిర్విణ్ణభావ యైన, కూర్మినందన నింటికిఁ గొంచుఁబోయె. 83

వ. అనంతరంబ రతిదేవి మోహాంధోన్మీలితంబు లైనలోచనంబుల నత్యంతప్రియదర్శనుం డగుప్రియుం గానక పురుషాకారంబున భూమిం బడియున్న భస్మంబుం గని యి ట్లని ప్రలాపింపం దొడంగె. 84

ఉ. చక్కనివారిలోన నెఱజాణలలో విటరాజకోటిలోఁ
జిక్కనివారిలోఁ గడుఁ బ్రసిద్ధివహించిన నీవు ప్రాణముం
దక్కనచోట నీమనను ధైర్యమున న్మిషిమింతురాలు గా
నక్కట! పుష్పసాయక మహాకఠినాత్మలువో మృగేక్షణల్. 85

మ. ప్రతికూలాచరితంబు నావలన నల్పం బైననుం గాంచితే
ప్రతికూలాచరితంబు నీవలన నల్పం బైన నేఁ గంటి నే
కృత మెన్నండును లేనిచంద మిది లక్ష్మీపుత్ర! నీయందు న
న్నతిదుఃఖాన్వితఁ డించి పోవఁ దగవా యధ్వానవుంబట్టునన్. 86

క. తలఁతే మన్మథ! గోత్ర, స్ఖలితంబుం జఘననూత్రకరబంధంబుల్
దలఁతే మఱి యా వసంతా, త్పలకలికారాధనంబుఁ దత్సమయమునన్. 87

క. మెఱయంగ ముసురఁ గురియఁగ, నుఱుమం బురవీథులం బయోధరవేళం
దెఱవల రమణులయొద్దకు, నిఱుఁజీకటినిశల నింక నెవ్వం డనుపున్. 88

సీ. మదిరారసాస్వాదమదవికారంబులు, బింబాధరలకు విడంబనములు
ప్రియవియోగంబున బెదరించువాఁ డయ్యె, నుడువల్లభుఁడు నిష్ఫలోదయుండు

కోయిలనోరూరు క్రొత్తమామిడిమోక, నవపల్లవంబు, బాణత్వ ముడిగె
శుకశారికలు గూడి శోకస్వరంబులఁ, బలవింపఁ దొడఁగెఁ దాపంబు గదిరి
గీ. మాసములు దుఃఖపడె మధుమాధవములుఁ, జిన్నిమలయానిలంబుఁ జిన్నవోయె
మాట లేటికి వేయు నోమగలరాజ, విశ్వమున నీవు లేకున్న వెలితివడియె. 89

గీ. హృదయమున నుండి యెప్పుడు హృదయనాథ
ప్రియముఁ జెప్పెద ననుటెట్ల భేషజంబు
హృదయమున నుంట నిజ మేని మదన యెట్లు
భస్మమైతివి నే నెట్లు బ్రదుకఁ గంటి 90

వ. మన్మథ! మధురాలాపవినిసర్గపండితంబు లగుగండుఁగోయిలల నేలొకో భువనంబులకు రాయభారంబు పంపవు? ప్రణిపాతయాచితంబు లగుగాఢోపగూహనంబులు మఱచితే? యార్తవం బగుకుసుమప్రస్థానంబు నాయంగంబులం దిది నీవు రచియించినది కదా? దక్షిణేతరం బగుమదీయచరణంబు లాక్షారాగపరికర్మంబునకుం దగదో? పతంగమార్గంబున నింగలంబునం బడి భవదంకం బాశ్రయించెదఁ గాక మదనుండు లేక రతీదేవి జీవించు ననునపవాదంబు లోర్వవచ్చునే? నీకుహృదీశ్వరుం డయినవసంతుం డెచ్చట నున్నవాఁడు? పటుక్రోధరేఖానటద్భ్రూభంగభీషణముఖుం డగుఫాలలోచనులోచనంబు చిచ్చున నతండును వెచ్చి నిన్నుఁ గూడెనే యని యనేకప్రకారంబులం బలవింపఁ దత్పరిదేవనాక్షరంబులు బాణపాతంబులంబోలి తూఁటువాటుటయు నెంతయు నొచ్చి యమ్మధుమాసం బక్కుసలయకోమలికిం బుట్టిన మహావ్యసనం బూరార్పం జేర వచ్చుటయు. 91

సీ. క్రొమ్మిడి కై పెక్కు కుసుమంబు లుమియుచు, నవటుప్రదేశంబునందుఁ బొరల
జేవురించిన లేఁత చెక్కుటద్దంబులఁ, దాటంకయుగళంబు తేన్నియాడ
నాక్రోశపరిదేవనాక్షరవ్రాతంబు, కంఠగద్గదికచేఁ గ్రుక్కుపడఁగ
హరినీలములచాయ నక్షిగోళమ్ముల, సొబగుగాఁ గన్నీటిసోన గురియ

గీ. ముత్తియంబులు పేరులు ముఱిసిపడఁగ
హస్తముల వీఁగఁ జనుదోయి యడఁచుకొనుచు
సంబెరం బిచ్చె రతిదేవి శంబరారి
కమలినవసంతు నెదుట దుఃఖార్త యగుచు. 92

వ. ఇవ్విధంబున నారామ పేరామనియెదుట నెమ్మనంబునఁ బేరామనియై వర్తిల్లునార్తి సంబెరం బిచ్చి సొమ్మసిలంబోయి లేచి వసంతునిం గనుంగొని మాధవ! నీచెలికానిం జూడు కపోతకర్బురంబైన భస్మంబైనవాఁడు! నీవు వచ్చుట యెఱుంగండు సుమ్మీ! సురాసురంబైన జగంబు బిసతంతుగుణంబైన కోదండంబునం గెలుగుండ్లువెట్టు నిట్టి

జగజెట్టియుం గలండే! యతిపరుషపవనసంపాతాహతం బైనదీపంబునుంబోలె నీపరమి
త్రుండు క్రమ్మఱిలండు సుమ్మీ! నాపాపంబునం జేసి విధి వెలిగాఁ గ్రొన్ననవిలు
కానిం గొనిపోయె. నీవును బరమమిత్రుండవు గావున నన్నును నగ్నిముఖంబున నీ
సఖుం గూర్పం బాడి. "శశితోడం గూడఁ గౌముదియు మేఘంబుతోడం గూడ
మెఱుంగు" ననుట సకల సమ్మతంబు. కుసుమశరుశరీరభసితచూర్ణంబు శరీరంబునం
దాల్చి నామేను విభావసునందు వ్రేల్చెదం గిసలయతల్పంబులకు నిట మున్న సహా
యుండ వగునీకుఁ జిత పేర్పం జాలవచ్చె నే యని పల్కి శోకావేశంబున వెండియు. 93

సీ. హస్తయుగ్మము మోడ్చి ప్రార్థించి పలికెదఁ, దమ్ముఁడా నా కిమ్ముఁ దగఁ జితాగ్ని
మందమందంబుగా మలయానిలంబులు, వెరవుతో మండంగ విసరుఁ గాతఁ
బరలోకతృప్తికై బంధు లిద్దఱకును, ధర్మోదకం బిందు తమ్మి తేని
సహకారమంజరీచరుపిండకబళంబు, పెట్టుండు మాకునై పికము ముట్టఁ

గీ. దేని పెట్టుండు కస్తూరిదీర్చియ చటుఁ, జేర గొజ్జంగపూనీటఁ జెంబు లిడుఁడు
నన్ను వలరాజుఁ దలఁచి మన్నన దలిర్పఁ, దగ సమర్పణ చేయుఁడు దంపతులకు. 94

వ. అని తెంపు సేసి యగ్నిప్రవేశంబున కాయితం బై యున్నసమయంబున రతినుద్దేశించి
యాకాశవాణి యోమన్మథపత్నీ! సాహసంబు వలవ దుడుగుము నీకుం జేరువన మే
లుగాఁగల యది నీమగండు కందర్పుండు భుజాదర్పంబునం గన్నుఁ గానక కనకగర్భుని
సమావిర్భూతమనోవికారునిం జేసి తనకుమారికయం దతనికిఁ గాఁ గానితలంపుఁ బుట్టించె
కన్నియం గవసిన తనయన్యాయంబునకుం దాన రోసి సరసిరుహాసనుం డీసునం బుట్టించిన
వాఁడు కుసుమశరుండు కదా! యద్దురాత్ముండు హరకోపానలంబున భస్మం బగుం
గావుత మని శపించిన యది కారణంబుగాఁ బ్రద్యుమ్నున కిద్దురవస్థ తటస్థించె 95

ఉ. ఎప్పుడు పెండ్లియాడుఁ బరమేశ్వరుఁ డద్రితనూజ వేడ్కతో
నప్పుడు లబ్ధసౌఖ్యుఁ డయి యంబికప్రార్థన నాసదాశివుం
డెప్పటియట్ల సర్వభువనైకధనుర్ధరునిం బ్రియుం బ్రియాం
బొప్పఁగ నిచ్చు నీకు మది నొందు తలంపకు నమ్ము మాత్మలోన్. 96

వ. అని యదృశ్యరూపం బైనభూతంబు రతీదేవిమరణవ్యవసాయబుద్ధి మందీభవింపం జేసెఁ
గుసుమాయుధబంధుం డగువసంతుండును నావృత్తాంతంబునకు సంతసించి య
క్కాంత నూరార్చి నాళాపాంతం బవలంబించి శంబరారిపత్నియు గౌరీకళ్యాణకాల
మ్ముం బ్రతీక్షించుచు విరహక్షీణం బైనశరీరంబు రక్షించుకొను చుండె నంత 97

ఆశ్వాసాంత్యము.

ఉ. మంకణమానివంశమణిమండన! కాంచిపురీనివాస! యే
ణాంకకిరీటదివ్యచరణాంబుజసేవక! వైరిభద్రనా

గాంకుశ ! హారహీరదరహాసవిపాండురకీర్తిచంద్రికా
లంకృతదిగ్విభాగ ! శుభలక్షణ ! వారిరుహాయతేక్షణా! 98

క. కరదీపదానశోభిత, బిరుదాంకిత ! యంబునిధిగభీరసుహృదయా!
హరచరణకమలపూజా, పరతంత్రస్వాంత ! వంశపావనచరితా! 99

మాలిని. మాచమాంబాసుతా ! మానదుర్యోధనా, యాచకాభీప్సితత్యాగచింతామణీ!
ధీచతుర్వర్గ! యాస్తిక్యసంపన్నిధీ! లోచనాంభోరుహాలోలలక్ష్మీకళా! 100

గద్యము.

ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ
శ్రీనాథనామధేయప్రణీతం బయినహరవిలాసం
బనుమహాప్రబంధంబునందుఁ
దృతీయాశ్వాసము.



శ్రీరస్తు.

# హరవిలాసము

## చతుర్థాశ్వాసము.



కావేరీవల్లభ!
లోకస్తవనీయ! సర్వలోకాశ్రయ! ద
ర్వీకరభూషణభక్త! సు
ధీకలితవివేక! యవచిదేవయతిప్పా!

వ. ద్వితీయవిలాసం బైనగౌరీకళ్యాణం బాకర్ణింపుము. 2

గీ. అవ్విధంబునఁ దనమోళిల నసమశరుఁడు, తనకుఁ గా నీశ్వరునిచేత దగ్ధ మైన
ధరణిధరకన్య నిందించెఁ దనదుమూపుఁ,బరులు మెచ్చనిచెలువునిష్ఫలమ కాద. 3

వ. అనంతరంబ వసుంధరాధరకన్య యవంధ్యప్రతిజ్ఞ యై తపస్సమాధినియతత్వంబు
వహియింప నిజాభిప్రాయంబు మేనకాదేవి కెఱింగించిన. 4

గీ. గ్రుచ్చి కౌఁగిలించుకొని యమ్మహీధర, సార్వభౌముదేవి చతురభంగి
బుజ్జగించి కూర్మి పొంపిరివోవంగ, హితమితోక్తిఁ బుత్రి కిట్టు లనియె. 5

ఉ. ఎక్కడ లేరె వేల్పులు సమీప్సితదాతలు ముద్దుఁగూన నీ
వెక్కడ ఘోరవీరతప మెక్కడ యీపటుసాహసిక్యముల్
తక్క శిరీషపుష్ప మవధానపరత్వమునన్ మధువ్రతం
బెక్కిన నోర్చునో విహగ మెక్కిన నోర్చునొ నిశ్చయింపుమా. 6

గీ. అని నివారించె గిరిపత్ని యనుఁగుఁగూఁతుఁ, బార్వతియుఁ దల్లిమాటఁ జేపట్ట దయ్యె
నీప్సితార్థంబునకుఁ జాలుహృదయరుచియుఁ, నిమ్నమున దోడిగిలునీరు నిలుపరాదు. 7

వ. అంత నాచంద్రానన సఖీముఖంబున నిజమనోరథంబుఁ దండ్రి కెఱింగించి యమ్మహాను
భావుచేత నరణ్యనివాసమునకును ఫలోదయాంతం బైనతపస్సమాధికిని నానతి వడసి
దృఢప్రతిజ్ఞానిర్వాహంబున. 8

ఉ. భూధరరాజకన్య మణిభూషణముల్ దిగఁద్రావి యీశ్వరా
రాధనకేళికౌతుకపరాయణ యై ధరియించెఁ బాండుర

క్షాధృతిపూర్వకంబుగఁ బ్రగాఢపయోధరమండలీసము
చ్ఛేదవికీర్ణసంహతుల నేలుమహీధరవల్కలంబులన్. 9

గీ. పాశుపతదివ్యదీక్షఁ జేపట్టి గౌరి, చంచరీకాంగనాగరుచ్ఛాయ నేలు
కుటిలకోమలతరదీర్ఘకుంతలములు, మడమ లంటఁగ నిడుపాటిజడలు గట్టె. 10

సీ. ముత్యాలమొలనూలు మురువునూపెడునట్టి, జఘనంబుపై మౌంజి సవదరించెఁ
గందుకక్రీడపై గారం బుపచరించు, హస్తాబ్జములఁ బూని నక్షమాల
కస్తూరికాంగరాగములతో విలసిల్లు, తనువల్లి హత్తించె ధవళభూతి
బొమ్మపెండిలపాటఁ బ్రొద్దుపుచ్చునెలుంగు, నీలకంఠస్తోత్రనియతిఁ గూర్చెఁ

గీ. బసిఁడికమ్ములయందంపుఁబట్టుచేల, కొంగుచాటున వర్ధిల్లుకుచభరమునఁ
గంతఁగా వైచెఁ బులితోలుకళవసంబుఁ, బరమకళ్యాణి గిరసార్వభౌమతనయ. 11

గీ. హంసతూలికపాన్పుపై నలరు మొగ్గ, యొత్తునను మేనుగల్గునీలోత్పలాక్షి
బాహువల్లి తలాఁడగాఁ బవ్వళించె, శైలపాషాణపట్టికాస్థండిలమున. 12

గీ. పాశుపతదివ్యదీక్షావిభాసమాన, దివ్యతేజోవిశేషసందీప్తమూర్తి
కాలతాంగికి శతవృద్ధులైనమునులు, ప్రణతు లగుదురు భావిప్రభావశక్తి. 13

వ. ఇవ్విధంబున ధరాధరశిఖరంబులయందలిహరిణకిశోరంబులకు నరణ్యబీజాంజలినిధానంబునుం దరులతాకుంజంబులకు నిర్ఝరధారాసేకంబును నొనర్చుచుఁ గృష్ణాజినోత్తరాసంగవతియు సర్వాంగభసితాభ్యంగమంగళస్నానయు నై కొంతకాలంబు గడపి కాంక్షితంబు కడఁ గానక తెంపు సేసి మండువేసవిం గనగన మండు నగ్నిముఖంబునడుమన నిలిచి మధ్యాహ్నకాలంబున నర్కమండలం బాలోకించియు వర్షాకాలంబునఁ బక్ష్మపాళీక్షణస్థితంబులును దాడితాధరంబులును బయోధరోత్సేధవిపాతచూర్ణితంబులును ద్రివళీవలయస్ఖలితంబులును నాభీగహ్వరప్రవిష్టంబులు నగుజలధరజలబిందుధారలం దోఁగియు శిశిరకాలంబునం దివతాళించుకొలంకులలోనం బుక్కిటిబంటి నీటనిశాసమయంబుల నిలిచియు నంబుచుళికంబులును నుడుపతికరంబులును గరువలిండుల్లినజీర్ణతరుపర్ణంబులును నాహారంబుగా దుష్కరం బైనతపంబు సేయుచుండ నొక్కనాఁడు. 14

మ. అజినాషాఢధరుండు ప్రౌఢతరభాషాతిప్రగల్భుండు నీ
రజబంధుప్రతిమానతేజుఁడు జటారాజిచ్ఛటాతామ్రమూ
ర్ధజుఁ డేకాకివటుండు బ్రాహ్మణుఁడు విశ్రామార్థముంబోలె నా
త్రిజగన్మోహనమూర్తిసన్నిధికి నేతెంచెన్ వనాంతంబునన్. 15

గీ. ఇవ్విధంబున నేతెంచి యెదుట నిలిచి, గౌరి నాశీర్వదించె నక్కపటవటుఁడు
కలితకోమలనవకుళగంధి యైన, యంగుళీపల్లవంబుల హస్తమెత్తి. 16

వ. పార్వతియు బహుమానపురస్సరంబుగా నయ్యూర్వీసురవటునకు నతిథిపూజ యొనర్చిన
నతండును గొండరాచూలి సేయుసత్కారం బంగీకరించి ముహూర్తమాత్రంబు
విశ్రమించి మేలువడిమాపునం జూచి ప్రస్తావనోచితంబుగా నిట్లనియె. 17

సీ. సలిలంబు త్రిషవణస్నానక్షమం బౌనె, యంభోజపత్రదీర్ఘాయతాక్షి!
కుసుమంబులును సమిత్కుశపల్లవంబులు, సులభంబు లై యున్నె సుందరాంగి!
సత్వంబు లన్యోన్యజాతివైరముఁ దక్కి, శాంతి గైకొని యున్నె చంద్రవదన!
యనుదినంబును దేహయాత్ర కాయిత మౌనె, నీవారపాకాది పూవుఁబోణి!

గీ. శక్తికొలఁదిఁ దపశ్చర్య సంఘటింతె, ఫలముపై నాస నాగ్రహబంధ ముడిగి
తామ్రబింబోష్ఠి ధర్మసాధనములందు, నాద్య మగుసాధనంబు దేహంబ కాదె. 18

క. మగువా! నీపెంచినలత, చిగురున ముకుళంబు నుల్లసిల్లెనె చెపుమా
పగడపుఁగెమ్మోవిపయి, న్నగ వుదయించినవిధంబునం బ్రస్ఫుటమై. 19

క. పంకజలోచన! కరద, ర్భాంకురములు మేసినట్టి యపరాధమునన్
రంకుమదపోతకంబుల, జంకింపవుగా తపఃప్రశాంతి వెలితిగాన్. 20

గీ. అత్రివీథిపరిచ్యుతం బైనయట్టి, యమరతటినీజలప్రవాహమ్ముకంటె
ధరణిధరరాజు నీచరిత్రంబుకతనఁ, బరమపావనుఁ డయ్యె నోపద్మనయన!. 21

వ. సంబంధంబు సాప్తపదీనంబు గావున నింతతడవు నీతోడఁ గదిసి పలుకుచునికిం జేసి
యే నాప్తుండఁ గావున నొక్కమాట యడిగెద బ్రాహ్మణజాతిస్వభావసులభం బైన
చాపలంబుఁ జూచి హెచ్చు గుందాడం బని లేమ రహస్యంబుగా నుండె నేనిం
జెప్పుము. 22

సీ. ప్రథమప్రజానాథపావనకులమునఁ, బ్రభవించి తబల! ప్రపంచసార
సౌందర్యసంపద సడిసన్నదానవు, నశ్వరం బైశ్వర్యనైపుణంబు
సౌఖ్యంబు నిరవధి సర్వసామగ్రినీ, యఱచేతిభాగ్య మత్యాయతంబు
భాగ్యంబు నీకేమి భ్రాంతి యైనది మనోరథ మేమి చెప్పుమా రాజవదన

గీ. దుష్కరం బైనతప మిట్లు దొడరి చేసి, మేను డయ్యించుకొనఁగ నేమిటికి వచ్చెఁ
జిత్తము విచారమార్గంబుఁ జేరఁదెచ్చి, తత్త్వముఁ దెలియఁ జెప్పు మాతము మృగాక్షి.

వ. పితృగేహంబున నవమానంబు పుట్టదు గదా! పన్నగఫణారత్నంబుమీఁదఁ జేయిసాచు
వాఁడు గలండే. నిండుజవ్వనంబునకుం దగినవిభూషణంబులు తొలంగం బెట్టి వార్ధ
కోచితంబు లగువల్కలంబు లెట్టులు ధరించితివి దేవలోకనివాసంబున కాసపడెదేని
నది వృథాశ్రమంబు! నీపుట్టినిల్లు దేవభూమియకదా? తగినవరునింగామించి
సమాధివహించితి వేని నదియు నీకుం దగదు రత్నం బొరునిచే నన్వేషింపఁబడుఁ

గాని యూరక నన్వేషించునే. నిట్టూర్పుగాడ్పులచే దుర్లభజనానురాగంబు నీయందుఁ
దేటపడుచున్నది. అట్టి కఠినహృదయుం డెవ్వండొకో వాఁ డెవ్వని నపేక్షించియేని
నీవు తపంబు సేయుచుఁ గలమాగ్రపింగళం బగుజటాభారంబు ధరియింపఁ దగ దని
యంతనిలువక యక్కపటవటుండు. 24

ఉ. ఏనును బ్రహ్మచారిఁ దరళేక్షణ! నీవును గన్య వెంతకా
లానకు నీకుఁ బెండ్లియ ఫలం బగునేని విచార మేల స
న్మానముతోడ నచ్చునను మాన్య వివాహము గమ్ము లెమ్ము కా
దేనిఁ దపంబులోనిసగ మిచ్చెద మాను తపోభిమానమున్. 25

వ. అనినం బార్వతి యమ్మిథ్యావటునకుం దనమనోరథం బెఱిఁగింప నొల్లక వయస్యం
గనుసన్న చేసిన నచ్చెలికత్తెయు న త్తపోధనకుమారునితో ని ట్లనియె. నయ్యా! నీకుఁ
గుతూహలంబు గలదేని వినుము కాలకంఠకఠోరకంఠరహుంకారపరివర్తకం బగుపుష్పచా
పునిసమ్మోహనాస్త్రం బీకన్యహృదయంబున నాటిన నాఁటంగోలె లలాటచంద్రధూసరా
లక యై తుహినసంఘాతితతశిలాతలం బగుజనకునింట ధృతిం జెందక మహేంద్రప్ర
భృతు లగుదిగీశుల నుజ్జగించి పినాకపాణిం బతిఁ గాఁ గోరి తపంబు సేయ సమ
కట్టె సబాష్పకంఠస్ఖలితంబు లగుసంగీతోత్కరంబుల విరూపాక్షుచరిత్రంబు పాడుచు
వసాంతసఖు లగుకిన్నరరాజకన్యకల వగపించుచుఁ ద్రిభాగశేషంబు లగునిశాసమయం
బుల నించుకించుక నిద్రించుచుఁ గలఁ గాంచి నీలకంఠ! యెవ్వోటికిం జనియెద వని య
సత్యకంఠార్పితబాహుబంధన యయ్యును విరహవ్యథాదుస్సహం బగుతపోభారంబున
భర్గు వశీకరింపం దలంచి యున్నయది యని పల్కిన. 26

చ. వికవిక నవ్వి యక్కపటవిప్రకుమారుఁడు మేలు లెస్స వా
నికి నయి రాగబంధమును నిల్పె మదిం దరళాయతాక్షి మీ
సకియ వివాహవేళఁ బురశాసనుపాణిఁ బరిగ్రహించుచో
మొకమున బుస్సుమంచు నహి మ్రోఁగిన నెట్లు భయంబు చెందునో. 27

సీ. రాఁచుంచ యందుఁ జీరకు జోక యగుఁగాక, పచ్చియేనికతోలుఁబచ్చడంబు
హరిచందనాస్పదం బగుచనుఁగవమీఁదఁ, బట్టుఁ జేకొనుఁగాక భసితధూళి
కమనీయచరణలాక్షారాగలేఖచే, ముద్రితం బగుఁ గాక రుద్రభూమి
కలితముక్తాఫలగ్రైవేయకంబుతోఁ, దులదూఁగుఁ గాక పెంజిలువపేరు

గీ. మనువు లెస్సయి యుండెఁ బో మానవతికి
నివ్విధం బన్న లోకంబు లెల్ల నగరె
యహహ! ముదిగొడ్డు నెక్కి బిక్షాటనంబుఁ
జేయఁ బోవుట యదియు మేల్బాయ మువ్వె. 28

ఉ. పుట్టు వెఱుంగ రెవ్వరికిఁ బోలదు మూఁడవకన్నుఁ జూచి చే
పట్టఁడు వెట్టివాఁ డయినఁ బ్రాణహరుం డట జంతుకోటికిన్
గట్టినతోలుచీర కలకల్మి ప్రకాశము సేయుచున్న ద
వ్వట్టునఁ జూచినన్ శివునిబైసి యెఱుంగఁగరాదు భామినీ. 29

గీ. మాట లేటికిఁ జాలింపుమా తపంబు, హరునిఁ గూర్చి సరోజపత్త్రాయతాక్షి !
వలదు తివియంగఁ బాఁతినవాఁడికొఱ్ఱు, యూపసత్క్రియ కర్హమై యున్నె చెపుమ

వ. అనిన నక్కపటవటునకు నవ్వధూటి యిట్లనియె. 31

ఉ. చాలు వివాదము ల్పదిగ శంభునిగూర్చి యిట్టిపల్కు లీ
వాలముచేసి పల్కితివి యైనను నా విను చంద్రమగ్కళా
మౌళిపయి న్మదీయ మగుమానస మెంతయుఁ జిక్కె నింక నేఁ
జాలుదు నయ్య యెమ్మెయి భుజంగవిభూషణునిం దొరంగఁగన్. 32

వ. అని జయావిజయులం గనుంగొని యపాంగంబులఁ గెంపు గదుర నీబ్రహ్మచారి శంకరుని గుఱించి యింకను వంకరకొంకరమాటలాడ నుంకించుచున్నవాఁ డితని మెడపట్టి నూకుం డని పల్కి కోపావేశంబున. 33

చ జిలుఁ గగుపల్కులాంచలము చెన్నయి చన్నులమీఁదఁ జాఱఁగా
నలుకఁ దుషారశైలసుత యవ్వలిమో మయి నాలుగేన్పదం
బులు సని భ్రూకుటీకుటిలముగ్ధలలాటముఖేందుబింబ యై
మలఁగి కనుంగొనెన్ భుజగమండను నక్కపటద్విజోత్తమున్. 34

శా. సాక్షాత్కారముఁ జెందె నవ్వుచు గిరీశానుండు ధాత్రీధరా
ధ్యక్షాపత్యముఁ బ్రేమ నిర్భరకటాక్షాలోకనప్రౌఢిమన్
వీక్షించెన్ దరశాక్షియు న్మనమున న్వ్రీడాప్రమోదక్షమా
దాక్షిణ్యాంబులు సందడింప నిలిచెం దత్సన్నిధావంబునన్. 35

చ. అరు దగునీతపమ్మునకు నమ్ముదువోయితి నేఁటికొమ్ము నీ
వరవుడ నంచు శూలి ప్రియవాక్యములం దగఁ గారవింపఁగా
ధరణిధరేంద్రనందన యుదగ్రతపోమహనీయవేదనా
భర మఖిలంబు వీడ్కొలిపి భావమునం బరితోష మందుచున్. 36

వ. జయవిజయ లనుప్రాణసఖులతోడం గూడ మాతండ్రి హిమవత్పర్వతేంద్రుండు దేవరకుఁ బ్రమాణీకరింపం బాత్రం బయ్యెను. కన్యకం బితృపరాధీన నగుట దేవరచిత్తంబున నవధరింపవలయు నని విన్నపంబు సేయించిన. 37

గీ. అమృతకరమౌళి యవుఁ గాక యనుచుఁ బలికి, వేడ్క గిరిరాజనందన వీడుకొలిపి
తారగిరికేళి దివ్యచిత్తమునఁ దలఁచె, సప్తమునుల నరుంధతీసంయుతముగ. 38

శా. ఆసప్తర్షు లరుంధతీసహితు లై యాకాశమార్గంబునన్
భాసందోహము సూర్యచంద్రరుచులన్ భంజింపఁగా డిగ్గి కై
లాసస్థానముఁ జేరవచ్చి కని రుల్లాసంబునన్ హేమపీ
ఠాసీనుం డయి దేవత ల్గొలువ రాజై యున్న శ్రీకంఠునిన్. 39

మ. పదియార్వన్నెపసిండివల్కలమునన్ భాసిల్లు ముత్యాలజ
న్నిదముల్ రత్నమయాక్షతంబులును మాణిక్యంపుఁబాత్రంబునన్
జదు రొప్పన్ ధరియించి యల్పధరణీజాతంబులన్ బోలెఁ గ
ట్టెదురన్ నిల్చినదివ్యసంయముల సంవీక్షించి సంభావనన్. 40

సీ. ఆకాశగంగలో నఘమర్షణస్నాన, మహరహంబును జేయునట్టివారిఁ
బ్రస్థాపితాశ్వచే భానుమంతునిచేత, గురుభావమున మ్రొక్కుఁ గొనెడివారి
నంత్యకాలమ్మునయం దుర్విలోఁ గూడ, నుదధిలోపల మున్గ కున్నవారి
సర్గశేషమునకై సాహాయ్య మొనరించి, పరమేష్ఠిచే మెచ్చుఁ బడయువారి
గీ. గగనమున లేడువురవారికట్టెదురన, పతిపదంబులపై దృష్టి భక్తినిడిన
దివ్యచరిత నరుంధతీదేవిఁ జూచి, సమ్మదము నొందె కందర్పశాసనుండు. 41

గీ. అంధకారి యరుంధతి నాదరించె, గౌరవంబున భేదంబు కలుగకుండఁ
బెద్దవారికి స్త్రీపుంవిభేద మేల, మాననీయంబు పుణ్యాకర్మంబుగాక. 42

క. ఆఋషులఁ జూడ శివునకు, దారపరిగ్రహము వెంటఁ దద్దయుఁ దగిలెన్
దారపరిగ్రహమే కద, సారపుధర్మముల కెల్ల సాధన మరయన్. 43

ఉ. పర్వతసార్వభౌముసుతపై ననురాగము సంప్రరూఢ మై
శర్వుని చిత్తవృత్తి కొనసాగుచు నుండుట కానవచ్చుటం
బూర్వపుఁదప్పుఁ జేసి వెతఁ బొందుచు నున్నయనంగుఁ డెంతయున్
నిర్వృతిఁ జెందె నా తనదునీతి ఫలించి తపంబు పండినన్. 44

వ. అప్పుడు సప్తర్షులు హర్షవినయభక్తిశ్రద్ధావిశ్వాసతాత్పర్యంబులు మనంబునం బెనఁగొనంగఁ గేలుదోయి మొగిచి ఫాలభాగంబునం గీలించి కంటకితకపోలభాగు లై దేవా! యింతకాలంబునకుం గదా మాతపోదానాధ్యయనయజ్ఞవ్రతాదిధర్మంబులు ఫలియించె భువనాధ్యక్షుండ వైననీవు మనోరథాగోచరం బైనమన్ననం జేసి మనోవిషయంబున మన్నించితి వింతకంటెను భాగ్యంబు గలదే యెవ్వానిచిత్తంబున నీవు వర్తింతువు వాఁడు కృతార్థుండు గదా నీచిత్తంబున వర్తించుమాకృతార్థత్వంబు వేఱ వర్ణింపనేల ? భవత్సంభావనావిశేషంబునయందు మాకు బహుమానంబు ప్రత్యయంబు నయ్యె యుష్మదనుధ్యానసంభవం బగుప్రమోదభారంబు మాయంతరంగంబులయం

గీ. అందఱను భ్రమపెట్టుచు నవ్వధూటి, యెవ్వరికిఁ దాను భ్రమయక యెదన యుండె
దానిపై వాలి చొక్కె నందఱమనములు, గంధఫలిమీఁద వాలుభృంగములపగిది. 104

గీ. అసురులకు దేవతలకు నయ్యవసరమునఁ, బాలువోకుండె నప్పు డప్పద్మనయన
యుభయవాదులు గూడి యయ్యుత్పలాక్షి, పాదపంకజములకును బట్టులైరి. 105

వ. మఱియు విష్ణుమాయావిశేషంబున. 106

క. ఇది చెప్పినట్లు చేయుదు, మిది పంచినయట్ల నడతు మిది కళ్యాణా
భ్యుదయనిధానము మా కని, హృదయంబులఁ దలఁచు చుండి రిరుదెసవారల్. 107

గీ. కనకసింహాసనము వెట్టి కాళ్లు గడిగి, పాదతీర్థంబు లొగిఁ ద్రావి ప్రణతిసేసి
కొలిచి కూర్చుండి రిరువంకకొలమువారు, భువనమోహిని యైనయప్పువ్వుఁబోఁడి.

క. ఎవ్వనివంకఁ గనుంగొను, నవ్వనితామణివిలోచనాంచలమున వాఁ
డవ్వేళనఁ గిలించు, న్నవ్వం బగుకేలుదోయి మకుటాగ్రమునన్. 109

వ. వైరాగ్యానుబంధంబు లుడిగి యియ్యిరువాగువారుం దమలోన నిట్లనిరి 110

క. మన మొండొరు నమ్మక యెడ, నునిచినయీయమృత మింతయును దగ నింకే
మని యొండుగాఁ దలఁప కీ, వనితామణి పంచిపెట్ట వలయుం జుండీ 111

వ. అని యమృతకలశంబుఁ దెచ్చి యప్పయోజాక్షిచేతి కిచ్చి ధర్మంబు పుణ్యంబు పాపంబు
నీయది యిరుదెఱంగులవారు నీకు నొక్కరూప యిప్పదార్థంబు మాకుం బంచిపెట్టుము.

గీ. తప్ప కుండఁగఁ బక్షపాతంబు లేక, పంచిపెట్టెదువా రబ్బరంచుఁ గాక
యన్నదమ్ముల మై యుండి యకట మేము, నిన్ను వడ్డించు మందుమె యన్నమిన్న

గీ. అనిన నేనేర్తు నయ్య మీయంతవారు, కోరి కూర్చుండ నమృతంబుఁ గుడువఁబెట్టఁ
బంచి వడ్డింపనేర్చు టల్పంపుఁబనియె, తొల్లి యొకనాఁ డెఱింగినత్రోవ గాదు. 114

వ. అయిన మీవచనంబులు చెఱపంజాల నానేర్చినవిధంబున సుధారసంబు వడ్డించెద మీ
రందఱుఁ గృతస్నానులై పయోధిపులినవేదికాస్థలంబున నిరుదెఱంగులవారును రెండు
బంతులుగాఁ గూర్చుండుఁ డని నియోగించిన. 115

గీ. వార లట్లచేసి వరుసగాఁ గూర్చుండి, పసిఁడిపళ్లెరములు పన్నికొనఁగ
నల్లనల్ల వచ్చె నలసయానంబున, నమృతకుంభహస్త యగుచుఁ దరుణి. 116

మ. అరవిందాసన పట్టుఁబుట్టముచెఱంగాందోళనం బొంద ని
ర్భరపీనస్తనభార మల్లఁ గదలన్ రత్నాలతాటంకము
ల్మెరయ న్నూపురమేఖలావలయముల్ మ్రోయంగ పాత్రంబుల
న్సురధేన్వాజ్యము త్రస్తరింపఁ దొడఁగె న్దూర్వాంకురాగ్రంబునన్. 117
స్నానపవిత్రగాత్రులును చందనచర్చితబాహుమధ్యముల్
ధ్యానసమాధినిష్ఠులును మత్సరచిత్తులు నై మహాసమా

ధానముతోడ నుత్తరము దక్షిణము న్నముపాశ్రయించి యి
ద్దానవులు న్సుపర్వులును దన్నుఁ బ్రియంబుగఁ జూచు చుండఁగన్. 118

గీ. మధురగోక్షీరధారాసమాన మైన, మంచియమృతంబు వెట్టె వైమానికులకు
మగువ మృగతృష్ణికాంభస్సమాన మైన, కల్లయమృతంబు వడ్డించెఁ గర్బురులకు. 119

వ. ఇవ్విధంబున నప్పరమాణుమధ్య తథ్యమిథ్యామృతాహారంబు లాసురానురులకు వెట్టి కామదుగ్ధసుఘృతధారాభిఘారంబుగావించి పంక్తిమధ్యంబుననిలిచి కంకణఝుణఝుణత్కారంబు తోరంబుగా నాపోశనంబు వోసి యారగింపుండు ప్రొద్దుపోయె ననుచు నెలుఁగెత్తి మత్తకోకిలకంఠకుహూపంచమస్వరంబునం బల్కిన. 120

గీ. మొదలఁ దేనియలుట్టు నంభోరుహాక్షి, ముద్దుఁబల్కులు శ్రుతిపుటంబుల భుజించి
పిదప భుజియింపఁ దొడఁగిరి త్రిదశవరులు, దైత్యులును దథ్యమిథ్యాసుధారసములు.

క. కిక్కురుమన కమృతంబుం, గ్రుక్కలు వెట్టుదురు సురలు కోణపముఖ్యుల్
తక్కరిసుధారసంబులు, గ్రుక్కలు వెట్టుదురు వారిఁ గూడియె తారున్ 122

గీ. గ్రుక్కగ్రుక్కకుఁ గడుఁ దేజ మెక్కుచుండె
నమరులకు గ్రుక్కగ్రుక్కకు నడఁగుచుండె
దైత్యులకుఁ దేజ మట్టివిధంబు గాక
రాహుకేతువు లనియెడురాత్రిచరులు 123

వ. తమయెదిరిపంక్తి నున్నచంద్రార్కులసంగడి న్నొలంగి కూర్చుండిన నాగ్రహరాజు లిద్దఱుం దమలోన నిట్లని విచారించిరి. 124

ఉ. వంచన వేల్పుటెంకి కిటువచ్చి యుపాంతమునందు ముందటం
గంచముఁ బెట్టుకొన్నయది కర్బురయుగ్మము మాఱువెట్టె నే
తెంచుచు నున్నవాఁడు మనదెవర విష్ణుఁడు వెంట వీరి నూ
చించుట మే ల్సుధారసము చిప్పఁడుపోయకమున్న శౌరికిన్. 125

గీ. అని విచారించి చెప్ప నున్నంతలోనఁ, బోసె నిరుగంచములయందుఁ బుడిసెఁడంత
త్రావియును ద్రావకుండఁగ రాహుకేతు, లనుచుఁ జెప్పిరి మురవైరి కర్కవిధులు. 126

మ. అటు విన్నప్పుడు తత్సుధారసము కంఠాధఃప్రదేశంబు సో
చ్చుట లేకుండఁగ రాహుకేతువుల యక్షుద్రోత్తమాంగంబు లొ
క్కట ఖండించెను మాయపుంబడఁతియాకారంబు వీడ్కొని య
క్కటకాలంకృతహస్తచక్రమున శ్రీకాంతుం డవిభ్రాంతుఁ డై. 127

క. రాహునకుఁ గేతునకు హరి, బాహాచక్రమున నదరు పాటిల్లుటయుం
హాహానినాదపటుకో, లాహలబహుళంబుగాఁ గలంగిరి దివిజుల్. 128

సీ. వేగ మాయావధూవేషంబు డిగఁద్రావి, కైకొనె నిజమూర్తి కైటభారి
హరి తమ్ము వంచించె సరివేళ గాదని, దైత్యులు చనిరి పాతాళమునకు
నమృతంబు భుజియించి యమృతకుంభముఁ గొంచు, జనిరి వేల్పులు నిజస్థానమునకు
బహువారములయందు బహువస్తువులు గాంచి, కలశపాథోరాశి కాను పుడిగె
గీ. నుక్కువడి యున్కిమాని పెల్లుబ్బె నాక, మప్సరసకామినీతురంగాదికముల
నచ్యుతుఁడు లచ్చి నటఁ బెండ్లియాడి యరిగె, నాగరిపు నెక్కి వైకుంఠనగరమునకు
క. ఈవార్ధిమథనకథనం, బేవారు పఠించిరేని నెలమియు నాయు
శ్శ్రీవృద్ధులఁ గాంతురు వి, ద్యావత్తయు యశము గల్గు నావారలకున్. 130

ఆశ్వాసాంతము.

శా. శంకాతంకవిహీనవిక్రమకలాసాకల్యవిజ్ఞాన! సా
హంకారోరువివేకవిక్రమ! సురాహారాహిపస్పర్ధిని
స్సంకాశోజ్జ్వలకీర్తివిభ్రమ! మహీసంకల్పకల్పద్రుమా!
లంకాశంకరశైలమధ్యవసుధాలంకార భవ్యక్రమా! 131

క. శరణాగతధీపంజర!, నరకుంజర! దానకర్ణ! నందితవిద్వ
ద్వరవర్ణ! విమలచరిత, స్ఫురితా! యనవరతశంభుపూజానిరతా!. 132

ఉపేంద్రవజ్రము. కులప్రదీపా! యలఘుప్రతాపా!
విలాసశక్రా! జితవీరచక్రా!
కలాజయంతా! ఘనకాంతికాంతా!
నిలీనశంకా! నిజనిష్కలంకా! 133

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్త్రి వినయవిధేయ
శ్రీనాథ నామధేయప్రణీతం బయినహరవిలాసం
బను మహాప్రబంధంబునందు
షష్ఠాశ్వాసము.

---



శ్రీరస్తు.

# హరవిలాసము

## సప్తమాశ్వాసము.



కాళహస్తినాథ
ప్రాకారాంతరగప్రణీతపాతాళగుహా!
శ్రీకాళహస్తిభక్తసు
ధీకల్పితవిభవ యువచిదేవయతిపా! 1

వ. ఆకర్ణింపుము. 2

ఉ. అర్జునుఁ డింద్రనీలగిరియందు రసాలతమాలతాలనీ
పార్జునలోధ్రతిందుకనవామలకీవనసామ్రపాటలీ
సర్జకురంటకాదిగురుచందనచందననింబకేతకీ
భూర్జకపిత్థపూర్ణముఖభూరుహపుణ్యతమాశ్రమంబునన్. 3

క. ద్యూతపరాభవమున నగు, చేతోదుఃఖమునఁ దపము చేయఁగఁ దొడఁగెన్
భ్రాతలయనుమతి శత్రు, వ్రాతజయార్థంబు మది దివస్పతి గురిగాన్. 4

మ. ధనురస్త్రంబులు కేలఁ దాల్చి శరధిద్వంద్వంబు నేపార వీఁ
పున బంధించి కిరీటియై కవచియై పూనెం దపశ్చర్య య
ర్జునుఁ డత్యంతగరిష్ఠనిష్ఠ నమరేంద్రుం గూర్చి యయ్యింద్రకీ
లనగాగ్రంబునఁ బ్రత్యనీకవిజయశ్లాఘాభిలాషంబునన్ 5

క. వంచన మనంబులోన నొ, కించుకయును లేక యమ్మహీంద్రముమీఁదన్
బంచానలమధ్యంబునఁ, బాంచాలీవల్లభుఁడు తపం బొనరించెన్. 6

గీ. గాండివముతోడ నొకయోగదండయష్టి, యస్త్రములతోడఁ గొన్నిదర్భాంకురములు
కలపములతోడఁ బుండరీకంబుతోలు, దాల్చి క్రీడి విరుద్ధపుఁదపము చేసె. 7

శా. శాకాహారుఁడు నిర్జితేంద్రియుఁడు పాషాణాగ్రతల్పుండునై
నాకేశప్రియనందనుండు సలిపె న్నానాప్రకారంబులన్
నాకుంజిత్తము దేహము న్సరియొకా నానాతపశ్చర్యలన్
వ్యాకీర్ణోరగసింహభల్లుకలులాయాభీలశైలాటవిన్. 8

సీ. పతయాళునిర్ఝరాంభఃప్రవాహంబుల, నఘమర్షణస్నాన మాచరించుఁ
గొండగోఁగుంబూల గుండనర్ధనముల, నర్చించు శశిలాంఛనార్ధమౌళి
స్ఫటికాక్షమాలికాపాణిప్రవాళుఁడై, జంభారిమంత్రంబు జపము చేయు
నొంటికాల బుజంబు నూర్ధ్వంబుగాఁ జాఁచి, తపవుగా నిలుచుండి తప మొనర్చు
గీ. శరభశార్దూలసింహాదిసత్త్వచయము, కెరలి తనమీఁద బిట్టు లంఘించునపుడు
కడిమిఁ జెండాడు భుజదండగాండివోగ్ర, చండతరశాతనిర్ఘాతకాండవితతి 9

గీ. వీరరసగర్భితం బయ్యు విస్తరిల్లె, శాంతరస మంతయును సవ్యసాచియందు
మలయశైలనితంబమండలమునందు, సర్పవేష్టితచందనక్ష్మాజమట్లు. 10

వ. ఇవ్విధంబునఁ గపికేతనుండు గాండివజ్యాఘాతరేఖాకిణకళంకాలంకారంబు లగుకరంబులు నీవారపాకంబునకును బాంచాలకన్యకాకుచకుంభకుంకుమప్రేక్షణీయం బైన వక్షంబు రుద్రాక్షధారణంబునకును నంగారపర్ణగర్వనిర్భేదనచణహుంకారకారణం బగు కంఠంబు మహేంద్రదేవతామంత్రాక్షరధారణంబునకును ఖాండవదహనవేళావిజృంభితావష్టంభసంరంభం బగుహృదయాంభోరుహంబు ప్రణవోపలంభమునకును గుంభసంభవప్రదిష్టశాఖాశిఖరపక్షిలక్ష్యావలోకనజాగరూకం బగువీక్షణంబులు నాసికాప్రదేశానుసంధానంబునకును యంత్రమత్స్యవిభేదనోపాయసందర్శనప్రభావసంసిద్ధి యగుబుద్ధి వృద్ధోపసేవనమునకును గంగాజలనిగ్రహానుగ్రహోపాదనసమగ్రం బగుమానసోత్సాహం బింద్రియభంగంబునకును నుత్తరదిగ్విజయయాత్రాధురీణంబు లగుచరణంబులు తీర్థగమనంబులకును బాల్పడఁ జేసి జగజెట్టిబిరుదంబు నెట్టుకొనం జేసి తండ్రి గుఱించి తపంబుఁ జేయుచుండ దినంబులు గడచె వారంబు లరిగెఁ బక్షంబులు సనియె మాసంబులు వోయె ఋతువు లతిక్రమించె సంవత్సరంబు దాఁటె నయ్యవసరంబున 11

సీ. తెల్లనిగడ్డంబు తెల్లనిమీసము, ల్కురసినరోమపాండురశిరంబు
మేధావిబొట్టును మెఱుఁగుజన్నిదములు, భూతిలలాటత్రిపుండ్రకంబుఁ
గావిదోవతియును గంధోత్తరీయంబు, నిష్టికోలయుఁ జంక నిట్టితోలుఁ
బంచాంగముష్టియుఁ బాణిఁ బవిత్రంబు, నొక్కవ్రేలికి వెండియుంగరంబు
గీ. జాఱుబొజ్జయు నునుదబ్బసంబెలయును, జెత్తగొడుగును జక్కఁదాల్చి కుతుకమునఁ
దనకు సజ్ఞాతిగా నొక్క తపసి వృద్ధ, బ్రాహ్మణుఁడు వచ్చె నొయ్యొయ్యఁ బార్థుకడకు

వ. వచ్చి యాశీర్వదించి మహాత్మా నీసంగడంబునం దపంబు చేయవచ్చితి నిచ్చోఁ గొన్ని దినంబులు క్రూరజంతువులు నన్ను బాధింపకుండ నరసికొని యుండవలయు నని పల్కి యతనిముందటఁ బరిశ్రాంతుఁడుంబోలెఁ జతికిలంబడి కూర్చుండి. 13

గీ. మోఱకునిచందమున నీఱుగొఱుచూపు, పాండవేయునిపైఁ దార్చి బ్రాహ్మణుండు
పలికె నిప్పచ్చరం బైనబాఁతమలఁ, బరమనాస్తికభావంబు పరిమళింప 14

గీ. అన్న! యెవ్వరివాఁడ వీయడవిలోనఁ, దపము సేసెదు నీమంత్రతంత్రపదులు
పాకశాసనదేవతాప్రార్థనాను, మాచకము లైనయవి యన్ని చూడ నిపుడు. 15

ఉ. చక్కనివాఁడ వెంతయును జల్లనివాఁడవు భాగ్యరేఖఁ బెం
పెక్కినవాఁడ వీవిపిన మెక్కడ నీసుకుమారతాగుణం
బెక్కడ ఘోరవీరతప మీయొలప్రాయమునందుఁ జేయునే
యక్కట యెవ్వఁ డైన నకృతాత్ముఁడ వీ వొకరుండు దక్కఁగన్. 16

క. శరచాపధారణంబుగఁ, బరమమునక్షాంతి దాంతిపరిపాకంబుగన్
బరికింపఁ 'జంకదుడ్డును, శరణార్థియు' న నెడునట్టివందము దోఁచెన్. 17

క. వైరిమదకుంభకుంభవి, దారణదారుణకృపాణధారలు పరిఘా
కారములు కందమూలో, ద్ధారములకుఁ బాలుపడెఁ గదా నీకరముల్. 18

శా. ఈభద్రాకృతి యిమ్మహాభుజయుగం బీదీర్ఘకోదండ మీ
యాభీలత్వ మొకం డొకొండ భువనైకాధ్యక్షతా హేతువే
లాభం బాత్మఁ దలంచి చేసె దొకొ గోలాంగూలభల్లూకస
త్త్రీభాకీర్ణ వనాంతరంబునఁ దపం బేకాగ్రభావంబునన్. 19

గీ ఈశ్వరునిఁ గూర్చి చేసెద వేని లెస్స, మాధవునిఁ గూర్చి చేసిన మాకు హితవు
బ్రహ్మఁ గూర్చి చేసిన నది పరమతరము, తగు నె యిలవజ్రధరుఁ గూర్చి తపము సేయ.

గీ ఎవ్వఁ డుపదేశ మొసరించె నింద్రుఁ గూర్చి, తపముసేయుము నీ వంచు దయ దలిర్ప
నాతఁ డెఱుఁగఁడు గాక యాయద్రిభేది, గౌతమునియింటఁ జేసినకారుగోష్ఠి. 21

సీ. ఆసహస్రాక్షునియాత్మసంశుద్ధికిఁ, బరమసంయమియింటిపంచ సాక్షి
యానిర్జితేంద్రుబాహావిక్రమమునకు, భుజగాంతకునియాకపోక సాక్షి
యాసునాసీరునహంకారగరిమకు, నిషధాచలముమీఁది నిలవు సాక్షి
యాశచీవల్లభు నౌచిత్యకలనకుఁ, దాపసుచేతిపూదండ సాక్షి

గీ. యిట్టిదేవేంద్రువలన నీ వేమి ఫలము, వడసెదవు చాలు నీవాంఛ పాడుగాను
వాఁడు నీకంటె నేమిట వాసి గలఁడు, తగదు చాలింపు మీవిరుద్ధంపుఁదపము. 22

వ. అని యెంత చెప్పిన నత్యంతధీరోదాత్తుం డగుపాండుపుత్త్రుం డూరక తపంబు చేయు
చుండె నట్టియేకాగ్రభావంబునకుం బ్రియంబు బంది వృద్ధబ్రాహ్మణవేషంబు మాని వృద్ధ
శ్రవుండు ప్రత్యక్షం బై వరంబు వేఁడు మనుటయు. 23

క. గురుభీష్మకర్ణసైంధవ, గురుతనయులతోడఁ గూడఁ గురుపతిబలము
న్నరిమార్పునట్టిసత్త్వముఁ, బురుహూతా యిమ్ము కరుణ పొంపిరివోవన్. 24

వ. అనిన నింద్రుండు సవ్యసాచి కిట్లనియె. 25

గీ. భీష్మగురుకర్ణకృపు లనిర్భేద్యబలులు, ద్రోణిభూరిశ్రవోభగదత్తశల్య
సైంధవులు పేరు గలవారు సమరజయము, శంభుకృప లేక యెట్టంగి సంభవించు. 26

వ. పశుపతిఁ గుఱించి తపంబు సేయుము తత్ప్రసాదంబున నీకుం జయం బయ్యెడుఁ
బునర్దర్శనంబు గాఁగలయది పోయి వచ్చెద నని యింద్రుం డంతర్ధానంబు చేసె. 27

గీ. తండ్రి చెప్పినమాటలు దప్ప కప్పు, డాదరించి ధనంజయుం డభవుఁ గూర్చి
యింద్రకీలాచలంబుపై నేకనిష్ఠ, ధీరుఁ డొనరించె నతిఘోరవీరతపము. 28

మ. భసితోద్ధూళితనిర్మలావయవుఁడు న్పంచాక్షరీసంతతా
భ్యసనవ్యాప్తిపరాయణుండును శివధ్యానానుసంధాతయున్
మసృణస్నిగ్ధతరక్షురప్రమయకంధాభద్రపీరుండు నై
యసమస్థేమఁ గిరీటి పాశుపతదీక్షారంభముం గైకొనెన్ 29

సీ. ప్రథమసంధ్యారాగపరిపాటి మిన్నెట్టి, కనకపంకజకోరకములు దెలుపఁ
గందువాఱినమించుగచ్చుటద్దమువోలె, విధుమండలము కాంతి వీడుకొనఁగ
దర మైనవేఁబోకఁ దఱపి వెన్నెలఁ గ్రోలి, దివిఁ జకోరములు మత్తిల్లి యాడ
మందరాచలకూటమధ్యభాగమ్మునఁ, గృత్తికానక్షత్ర మత్తమిల్ల

గీ. మృదులభస్మరచితశయ్య మేలుకాంచి, యమలరుద్రాక్షధారణం బాచరించి
యర్జునుఁడు పర్ణశాలికాభ్యంతరమున, హరున కొనరించు నరుణోదయార్చనంబు. 30

క. కపికేతుఁ డింద్రకీలా, ప్రపాతపతయాళునిర్ఝరస్నాతుం డై
యుపచారవిధుల నన్నిటఁ, దపనోదయవేళ వ్యాళధరుఁ బూజించున్. 31

మ. అవధానంబునఁ బాకశాసనసుతుం డర్ధేందుకోటీరు సం
గవకాలంబునఁ బూజసేయు హిమవాఃకర్పూరకస్తూరికా
ద్రవకాలాగరుగంధసారసురభిద్రవ్యంబులం బూవుల
న్లవలీసర్జరసాగురుప్రముఖనానాధూపధూమంబులన్. 32

శా. పంచబ్రహ్మషడంగబీజసహితప్రాసాదపంచాక్షరీ
చంచన్మంత్రపరంపరాపరమనిష్ఠాతత్పరత్వంబునన్
మంచుంగొండయనుంగుఁబెండ్లికొడుకు న్మధ్యాహ్నకాలంబు సే
వించు న్నిర్జరరాజసూనుఁడు మనోవీథి న్సదానందుఁడై. 33

శా. ఆయామ్రాజినఖండమధ్యమున సేవాబద్ధపద్మాసనుం
డాయింద్రాత్మజుఁ డింద్రకీలశిఖరీంద్రాయాథబిల్వద్రుమ
చ్ఛాయానిర్మలచంద్రకాంతమణిపాషాణప్రదేశంబున
సాయంకాలము పూజ సేయు నభవు న్సంధ్యానటుం ధూర్జటిన్. 34

ఉ. అంచితభక్తితో శివుని సర్వనిశాసమయంబునందు సే
వించు గురూపదేశపదవీపరిశుద్ధసమర్చనావిధిన్
గాంచనకోరకంబుల దిక్ప్రసవంబులఁ గొండగోఁగులన్
గాంచనకందరాముఖగృహంబులఁ బార్థుఁడు సంస్కృతార్థుఁ డై 35

వ. ఇట్లు పాశుపతదీక్షాధురంధరుం డై కాలకంధరుం గుఱించి తపంబు సేయుచుండఁ గొం
డొకకాలంబునకు. 36

మ. ఒకనాఁ డింద్రతనూభవుండు గిరికూటోత్సంగభాగంబున
న్వికచానేకలతాతరుప్రతతులన్ దేవార్చనాపుష్పకో
రకము ల్గోయుచు నుండఁ గా వినఁబడెన్ శ్రవ్యంబు లై ఘుర్కుర
ప్రకరోదంచితకంఠకాళకహలీబాబామహారావముల్. 37

గీ. చాయగోసులకంటెఁ గేసరులకంటెఁ, బులులకంటెను బిసరులై పొగరుమిగిలి
జల్లుకొని వచ్చెఁ దైపైనిసారమేయ, యూథములు వేదమయమూర్తు లుద్ధతముగ 38

గీ. ప్రకటలీల నుదాత్తంపుఫణితిఁ గొన్ని
క్రమములో ననుదాత్తస్వరములఁ గొన్ని
స్వరితములఁ బ్రచయంబుల వరుసఁ గొన్ని
ఘోషణము సేయఁ దొడఁగె నాకుర్కురములు 39

క. కనకపుశృంఖలలఁ ద్రయీ, శునకంబులఁ బట్టుకొనఁగ నూరెలఁ బ్రమథుల్
తను నిరుచక్రియ లీలా, వనచరులై కొలువఁ గపటవైహారికుఁ డై. 40

సీ. వికటపాటలజటామకుటికాభారంబు, కఱకైనజుంజుఱుజెఱులు గాఁగఁ
జారుసుధాధామశకలావతంసంబు, పెడకొప్పుపై నుండుపీఁకె గాఁగ
ఘనలలాటంబునఁ గనుపట్టుకనుచిచ్చు, గైరికద్రవతిలకంబు గాఁగఁ
భుజమధ్యమునఁ గ్రాలుభుజగహారంబులు, గురిజపూసలగుబ్బసరులు గాఁగ
గీ. శంకరుండు గిరాతవేషంబు దాల్చి, యగజ చెంచెత యై తోడ నరుగుదేఱఁ
బాణి నోంకారదివ్యచాపము ధరించి, వచ్చె విప్యచ్చువరతపోవనముకడకు. 41

వ. అట్టిసమయంబున. 42

చ. జలధరనీలదేహమును జంద్రకలాయుగళీసమానదం
ష్ట్రిలు భిదురోపమానముఖసంపుటపోత్రము ఫుల్లమేచకో
త్పలదలవర్ణకర్ణములు చాటలవత్తులలోచనంబులుం
గలిగి కఠోరకంఠఘనఘుర్ఘురఘుట్టనఘోషజన్మ మై. 43

ఉ. ముట్టియ నింద్రనీలతటమూలమహీప్రభవంబు లైనపె
న్నుట్టలు ద్రెచ్చి వైచుచును ఘూర్ణితపాతదమఁ జావకట్టుగా

మట్టుచు ఘుర్ఘురధ్వనుల మాటికిమాటికి దిక్పుటంబులం
ఘట్టన చేయుచు స్వేదఁదకన్నుల నిప్పులు వెళ్లగ్రాయుచున్. 44

క. పంది వడిఁ బాఱుదెంచెఁ బు, రందరనందననిశాకరధరులనడుమన్
దందడి గొరిజలతాఁకునఁ, గందుకములువోలె శిలలు గరువాఱంగన్. 45

ఉ. ఏసెఁ బినాకచాపమున నీశుఁడు గాండివకార్ముకంబునన్
వాసవసూతి యాప్రబలవజ్రసమానములైనబాణముల్
రాసెఁ బరస్పరంబును వరాహముప్రక్కలు గాడిపాఱ మూ
కాసురసూకరంబు దిరుగాడె వడి న్మరణాంతవేదనన్. 46

క. అభవార్జునశరపాత, ప్రభవవ్యథఁ దిరిగె నవ్వరాహము కడు సం
క్షుభిత మయి విలయవేళా, నభస్వదుద్భ్రాంతఘనఘనాఘనముక్రియన్. 47

క. దీర్ఘతరహరనరాశుగ, నిర్ఘాతనిపాతజాతనిబిడవ్యథ నం
తర్ఘూర్ణమాన మగుచును, ఘుర్ఘురఘోషంబుతోడఁ గ్రోడము గూలెన్. 48

వ. అప్పుడు గిరాతవేషధారి యగుపురారి యోంకారచాపంబు నేల నిలువంబెట్టి తదీయ శిఖరంబున నఱచేయి మోపి యొరగి యొయ్యారంపునిలుకడ నిలిచి వలకేల వాలమ్ము ద్రిప్పుచుఁ గట్టెదుర నున్నజగజెట్టి యగునింద్రునిపట్టిం గనుంగొని ప్రావృషేణ్య పయోవాహగర్జాగంభీరం బైనస్వరంబున నింద్రకీలగిరిగహ్వరంబులు ప్రతిధ్వని యొసఁగ సాటోపంబుగా సగర్వంబుగా సావష్టంభంబుగా ని ట్లనియె. 49

గీ. ఎవ్వఁడవు రోరి నీవు నాయెదురఁ బాఱు, పంది నేసితి బాహుదర్పంబు మెఱసి
యెఱుఁగవుర యోరి నన్ను నీయింద్రకీల, పర్వతం బేలువనచరసార్వభౌము. 50

ఉ. ఏనను నాకుటుంబ మగునీతరళాక్షియు వెంట వెళ్ళి యి
క్కాననభూమిలో బహుమృగంబులఁ జంపుచు వచ్చివచ్చి యే
నీనిశితాస్త్రపాతమున నిక్కిటిఁ జంపుదు నంచు వాక్ప్రతి
జ్ఞానియమంబున న్వెనుకజాడగఁ గూడఁగ వచ్చు చుండఁగన్. 51

క. వేఁట నలసి యీచెంచెత, యోటమివెట్టం గడంగి యున్నట్టియెడన్
గాఱెఱుఁగు గోలవింటన్, జీటంబున వేడ్కయొల్లఁ జెఱచితి కదరా 52

గీ. తపసి వై యుండి తగు రోరి ధనువుఁ బట్ట, శాంతిపరులకు నేలరా సత్వహింస
కపటధారివి రత్యంతకల్మషాత్మ, యెవ్వఁడవు రోరి నాపంది నేయ నీవు. 53

క. మండెడుబలువారసమున, గుండియ వగులంగ నేసి కూల్చితి దీనిన్
వెండి ప్రయోజన మేదీ, రండాసుత! దీనిపై శరము నిగుడింపన్. 54

ఉ. తలిసివి గానఁ జావునకుఁ దప్పితి నీ కిది వేఁటవంతమా
యబలుఁడ నీతెఱంగునఁ గిరాటవి[illegible]

నిబిడశరాహతం బగుచు నేచరజంతువు నేసి తీగతిఁ
సబముపయి న్నిగుడ్చి నిశాతశిలీముఖ మెట్టి పెట్టితో. 55

వ. అనినం గిరీటి యయ్యాటవికచక్రవర్తికి ట్లనియె. 56

క. పైవచ్చు క్రూరజంతువుఁ, జేవెరవున సేయ బెందు సిగ్గే చెపుమా
యీవక్రభాషణంబులు, నీ వాడెదు శబర పొమ్ము నీచను త్రోవన్. 57

క. పంది నపేక్షించితివో, పందెము గెలువంగ వేడ్క పడియెద వేదో
కందువుగా కాఫలము పు,ళిందాధిప యేమిటికిఁ బలికె దీభంగిన్. 58

మ. తడవే లోఁరి పుళిందరాజ! చను మధ్యాహ్నంబు డాయంగ న
య్యెడు నీవేళ శివార్చనంబునకు మా కేకాంతమై యుండఁగాఁ
బడు నీవుం గడు డస్సినాఁడ వటవీసంక్రిప్రకారంబులన్
విడు కోపం బిదె శాంతి గైకొనుము వాగ్వివాద మిం కేటికిన్. 59

క జోటియు నీవును గుర్కురి, కోటియు ననుచరులు డప్పిగొన్నారు మహా
ధాటి పరిశ్రమమున ని, చ్చోట వసించెదరయేని సుఖముండఁ దగున్. 60

వ. అని యర్జునుండు పల్కిన నాగజ్జాలాఁడు మోఱకంబున మొగి మడ్డంబు గదల్చి యీ
యెడ్డిమాటలం బనిలే దీపంది యొక ప్రయోజనంబె వేఁటపంతంబు దప్పి మమ్ము నధి
క్షేపించితి వీతప్పునకుఁ దపసివిగాన నిన్ను శిక్షింపను పొమ్మది యునుం గాక. 61

గీ. తాటియంతవిల్లు ధరియించినాఁడవు, జ్యాకిణాంకితము భుజాయుగంబు
గర్వరేఖ మిగులఁ గానంగ నయ్యెడు, దాంభికంబు నీదుతబిసితనము. 62

శా. ఏమో నాహృదయంబు నిన్నుఁ గని యిట్లే చాపమం దాసమై
భామాసన్నిధి నుబ్బుచున్నయది నీబాహాప్రతాపంబు ని
స్సీమం బే నొకకొంతసేపిచట నుజ్జృంభించరాఁ జేయుమా
వామీఁద న్నిగుడింపుమా నిశితనానాక్రూరనారాచముల్. 63

క. చెం చని నన్నుం జూడకు, వంచింపకు హీనజాతివాఁ డని సంగ్రా
మాంచలమున నిదె నను మె, చ్చించెదవే నపుడు నిన్ను సేబాసందున్. 64

మ శివలింగార్చన మెందువోయెడుఁ దపస్విత్వమ్ము నెందే నుప
ద్రవముం బొందదులే యొకింతవడిలో ధ్యానానుసంధానముల్
వ్యవధానం బొకయింత సైఁచవొకో బాహావిక్రమశ్రీమహో
త్సవముం జూపుదుగాక నా యెదుర నాశ్చర్యం బవార్యంబుగన్. 65

గీ. ప్రదర మరివోయు మేయము ప్రాకృపరికారి, కౌతుకాధీనహృదయుండఁ గాను నేను
ఘోర కులపల్లి యైనయీనీరజాక్షి, యాసుపథుచుండు ఘోరఘోరావహములు. 66

వ. అని పల్కి యాక్రీడాకిరాతుండు గుణధ్వని చేసిన జలధరధ్వానగంభీరం బై యుత్తం
ముణాఘ్రాతకు నిల్పు చూపినఁ గోపించుగంధద్విపంబుంబోలె రోషించి యర్జునుండు
గాండీవగుణగర్జాడంబరంబున నంబరంబు పిక్కటిల్ల నాటకిరివిలుకానిపై భల్లం
బులు నిగుడించె. 67

శా. గాండీవప్రవిముక్తనిష్ఠురమహాకాండప్రకాండంబులన్
ఖండించెన్ బ్రతిబాణఘట్టనమునం గంధర్వవిద్వేషి యా
తం డాశ్చర్యము నొంది బాపురె పుళిందశ్రేష్ఠ! యంచు న్భుజా
దండాహంకృతి వెండియుం బఱపె శాతక్రూరనారాచముల్ 68

శా. ప్రారంభం బొకయింత లేకను దృశాప్రాయంబున న్లొందఁగాఁ
గ్రూరాజిం దగనేసెనో నటికెనో క్రొవ్వాఁడిఱంపంబుచే
నీరీతిం దునుమాడవచ్చునె యనన్ హేలాగతిం ద్రుంచె దు
ర్వారాహంకృతి నీశ్వరుండు విజయాస్త్రవ్రాతమున్ వ్రేల్మిడిన్. 69

క. శితికంఠుఁ డేయుశరములు, ప్రతిహతములు సేయు నరుఁడు పార్థునిశరముల్
శితికంఠుఁ డేయుశరములఁ, బ్రతిహతములు సేయు బహుళబాహాప్రౌఢిన్. 70

క. క్రూరతరహరనరాశుగ, నారాచశిలీముఖాదినానాస్త్రఘటా
నీరంధ్ర మైననభమునఁ, గారుకొనియె గాఢ మంధకారము దిశలన్ 71

క. ఓంకారగాండివజ్యా, టంకారంబులు నభగకటాహము నిండెన్
శంకరకపికేతుభుజా, హంకారనిరంకుశాహవాంగణభూమిన్. 72

వ. ఇట్లోహరిసాహరి నల్లాడుహరార్జునులయందు. 73

క. శరధులు యుగాంతవేళా, శరధులునుం బోలె నయ్యె శరశూన్యంబుల్
సురపతిసూతికిఁ బరమే, శ్వరమాయాశక్తి నపుడు సమరాగ్రమునన్ 74

ము. తెలివిం బొందక యుండె నెమ్మనమునం దివ్యాస్త్రమంత్రాక్షరం
బులు శారద్వతకుంభసంభవులసంబోధంబు సర్వంబు ని
ష్ఫల మయ్యెన్ బృథ యయ్యె నాంతరకృపాభ్యాసంబు గాండీవికిన్
గలహక్షోణిఁ బినాకపాణికుహనాకౌటిల్యశిల్పంబునన్. 75

క విటలవిలోచనమాయా, ఘటనమునఁ గిరీటి తనప్రగల్భత చెడినన్
గుటిలముగ బొమలు ముడిచెను, గటకటఁ బడఁ దొడఁగె నపుడు కరము సుమర్చెన్.

శా. కాండశ్రేణత నాయిషుచ్ఛటలకుం గల్గెంగదే నాథముగ
పాం[illegible]ర్యం బెటపోయె నొక్కొ యని చెప్పం జిట్టలోఁ గాక యీ
తం డీలాగునఁ బోవునాఁడె మయిమైఁ దా నంచు గర్వోద్ధతిన్
గాండీవంబునఁ బొన్చి వేయఁ దొడఁగెన్ గాండీవి గంగాధరున్. 77

క. మృడు సెన్నఁడు శరములఁ గ, వ్వడి బొదువం దొడఁగె గాండివంబున నపుడే
యుడుగక పొడమెడుభయమున, వడఁకులగుబ్బలికుమారి వడవడ వడఁకెన్. 78

సీ. కలుకువెండ్రుకలలోఁ బలుచుమందాకిని, సుకుమారదేహంబు సుర్రుక్కఁబాఱె
నవతంసకుసుమమాల్యంబైనశశిరేఖ, బ్రహ్మకపాలరంధ్రమునఁ దూఱె
నెట్టియంబుగ బిగ్గఁ జుట్టినపెనుబాము, బిగియూడి నొసలిపై డిగఁగ జాఱె
నలికనేత్రముకిత్తి యారజ్యమానమై, ఱెప్పలసందుల నిప్పు లుమిసె
గీ నగజ భయ మందెఁ బ్రమథులు బెగడు గుడిచి, రుపనిషత్తులు ఘోషించె నొక్కపెట్టఁ
గాలకంఠునిమౌళిశృంగాటకంబు, గాండివంబునఁ దాడింప పాండవుండు. 79

గీ. పాండునందన ఘనభుజాదండకలిత, చండగాండీవతాడితఖండపరశు
పృథుజటామండలంబునఁ బిండుగట్టె, తాండవం బాడె మున్నేటితరఁగదండు. 80

గీ. వింటఁ గొని వ్రేయ వ్రేయఁగ విసుగు పుట్టె, జెట్టిబిరు దింతె పొమ్మని పట్టి యణఁచె
సురతనూభవునిం బట్టి శూలపాణి, మల్లసంగ్రామకేళి సంభావనముల. 81

క. కపికేతువృషభకేతను, లుపజాతనియుద్ధకౌతుకోత్సాహమునన్
నిపుణతఁ బెనఁగంగఁ దొడఁగి, రుపతాయి స్వేషభాష లుపలాస్యముగన్. 82

గీ. తోరహత్తంబునందుఁ బార్థుండు గడిమి, సలిపె నూరులు బీడించె సరభసమున
హరుఁడు సీసాన హత్తించి యర్జునునకు, బరువు గావించె నిశ్వాసపవనమునకు. 83

క. ముక్కంటి కంఠమూలము, డొక్కరమున నిఱికె బార్థుఁడు ప్రబంధుండై
చక్కని ప్రకోష్ఠపీడన, మిక్కిలికను వేఁశి నుఱికె మినుమినుకుమనన్. 84

క. తాఁచుచుఁ బొడుచుచుఁ బడుచును, నేఁచుచు నడుగుచును బిట్టు నెగయుచుఁ గూలం
ద్రోఁచుచు దూలుచుఁ బెనఁగిరి, ప్రాచీపతిసుతుఁడు హరుఁడు బాహాబాహిన్. 85

శా. నిష్టంకించి శశాంకశేఖరుఁడు గాండీవాయుధుండు న్భుజా
వష్టంభంబులు సిద్ధచారణులు గైవారంబు గావింపఁగా
దిష్టాంతాంతకఘోరమూర్తు లయి సాదృశ్యం బదృశ్యంబుగా
ముష్టీముష్టి రణంబు చేసిరి యసహ్యోహప్రకారంబులన్. 86

క. చెమరుచుట యాడుగఱచుట, బొమ ముడుచుట నిర్వికారమును మును నవరి
శ్రమమును సరిసరిఁ బెనఁగిరి, సమవిషమనియుద్ధకేలి శంభుఁడు నరుఁడున్. 87

క. తాటించెఁ శిరణము నా, స్ఫోటించెఁ గిరీటివక్షము వృషాంకుఁ డతం
డాటోపనుఱక పిడికిటి, పోటిన ధూర్జటియురంబుఁ బొడిచెం గడిమిన్. 88

శా. అంతం జంద్రకళాధరుండు నిజబాహాగాఢపీడాపరి
శ్రాంతుండై యటఁ బాండుసూతిరొదురం బ్రత్యక్ష మయ్యెం గృపా

నంతుండై యహిరాజహారములతో స్వర్వాహినీవేణితో
దంతిత్వక్పరిధానపల్లవముతోఁ దామ్రజ్జటాపంక్తితోన్. 89

ఉ. చెంచెత యయ్యెఁ బార్వతియుఁ జెంచులు భూతములై నిజాకృతి
న్మించిరి వేలుపు ల్నభముమీఁద లలాటమునందు నంజలు
ల్మించి నమస్కరించిరి వినీతియు భక్తియు నుల్లసిల్లఁగా
వించెఁ బ్రణామము ల్ఘనము విస్మయ మందుచుఁ బార్థుఁ డత్తతిన్. 90

గీ. వేదము ల్నాల్గు నుపనిషద్విద్యఁ గూడి, ప్రణవమంత్రాక్షరములతోఁ బ్రస్ఫుటముగ
విశ్వకర్తృత్వ మెయ్యెడ వీడుకొనుచు, నభినుతింపంగఁ దొడఁగెఁ జంద్రార్ధమౌళి.

వ. అప్పుడు పార్థుండు కృతార్థుండై రోమాంచితకంచుకితాఖిలాంగుండై యానందబాష్ప
లోచనుండై కేలుదోయి ఫాలభాగంబునం గీలుకొల్పి యిట్లని స్తుతించె. 92

క. నీవ పరబ్రహ్మంబవు, నీవఖిలాండాండపతివి నీవు ప్రసన్న
శ్రీవిభవారోగ్యాయుః, ప్రావీణ్యప్రాభవైకఫలదుఁడవు శివా!. 93

క. నిన్నుఁ ద్రిజగన్నివాసుని, బన్నగకంకణుని భక్తపరతంత్రుని న
భ్యున్నతకరుణాగుణసం, పన్నుని గనుఁగొంటి మంటి బాలేందుధరా!. 94

క. నీచేతఁ గృపానిధిచే, వాచాగోచర వివేక వైయాత్మ్యనిచే
నోచంద్రకలాశేఖర!, యాచించి మనోరథార్థ మర్థిం గందున్ 95

శా. నీకై యేను దపంబు చేసితి మహానిష్ఠాగరిష్ఠస్థితి
న్నీకై సంస్తుతి సేయుదుం గడఁగి నానేర్పొప్పఁగా నెంతయు
న్నీకై పూజ యొనర్తుఁ గొంత విరుల న్నిత్యంబు సద్భక్తితో
నీకై సేవ యహర్నిశం బొనరుతు న్వేదండచర్మాంబరా!. 96

గీ. సాటి యెవ్వరు నీకు నిశాటభూష!, కైటభారాతిహాటకగర్భవంద్య!
ఘనజటాజూటవాటికాఘటితవికట, గగనగంగాప్రవంతిక! కరటివైరి!. 97

క. నీయందు జగము లుండుం, బాయక యాజగములందుఁ బాయక నీవుం
డీయమవు దెలియ నజునకుఁ, దోయజనేత్రునకు నైనఁ దోఁపదు శర్వా!. 98

మ. జయ సర్వేశ్వర! సర్వలోకజనకా! చంద్రార్ధచూడామణీ!
జయ కామాంతక! కామితార్థఫలదా! చక్షుశ్శ్రవఃకుండలా!
జయ సంపూర్ణకృపాగుణైకవసతీ! శైలేంద్రజావల్లభా!
జయ దక్షాధ్వరమర్దనా! జయ గిరీశా! యీశ! రక్షింపవే. 99

ఉ. కొండకిరాతుఁ డంచుఁ గయికోక యసంగతభాషణంబు లు
ద్దండత నాడితిఁ గర ముదగ్రత నొంచితి ముష్టిఘట్టనం

గాండీవచాపదండమునఁ గ్రచ్చఱ మోదితి మౌళి భోగభృ
త్కుండల! పెక్కుచందముల ద్రోహము చేసితి నేమి సేయుదున్. 100

వ. అని మఱియు మఱియు సాష్టాంగప్రణామంబు లాచరించి నిలిచిన పాండవమధ్యముం జూచి ఖండపరశుండు నీతపంబునకుఁ బాశుపతవ్రతనిష్ఠాగరిష్ఠతకు భుజాశౌర్యంబునకు సంతసిల్లితి నీవరం బేదియొ వేఁడు మనుటయు. 101

గీ. అభవ! యీ నాకు నీప్సితం బగువరంబు, దయఁ బ్రసాదించి రక్షింపఁ దలఁచితేని
రౌద్రమై ఘోరమై లోకరక్షరైన, పాశుపతసంజ్ఞ మగుదివ్యబాణ మిమ్ము. 102

వ. అనినఁ బ్రీతచేతస్కుండై శంభుండు శాంభవీహృదయానురాగంబునను బ్రమథపరివారసమక్షంబునను మందస్మితంబు కందళింపఁ గరుణాకటాక్షవీక్షణంబున నప్పాండుకుమారుం జూచి త్రిపురదైతేయసుందరీవదనారవిందవాసరావసానసంధ్యాసమయసమారంభంబును గరళిదనుజకుంభకూటకూటపాకలజ్వరస్తోమంబును జలధరజలధరవ్యూహజంఝాసమీరంబును నంధకాసురప్రద్యోతనప్రభామండలంబును శార్దూలదానవారణ్యహవ్యవాహంబును నగునమ్మహనీయదివ్యాస్త్రంబు ససంప్రయోగంబు సోపసంహారంబు సకీలకంబు సరహస్యంబుగా నుపదేశించె నపుడు సేవాసమాపన్ను లగుకిన్నరకింపురుషగరుడగంధర్వవిద్యాధరులు తమతమదివ్యాయుధంబు లిచ్చిరి పార్వతీదేవి యక్షయబాణతూణీరంబు లొసఁగె దండధరుండు దండంబును బాశపాణి పాశంబును నింద్రుండు వజ్రంబును సమర్పించి రిట్లు వరప్రదానంబు సేసి యీశానుండు సపరివారుండు సాంబుండునై యంతర్ధానంబు చేసె ననంతరంబ. 103

గీ. పరమసంతోషమును బొంది బలవిరోధి, పుత్త్రుఁ గౌఁగిటఁ జేర్చి యాపోనికూర్మి
సమ్మదాశ్రుకణంబులు సంప్రఫుల్ల, చక్షురంభోజదళసహస్రమునఁ బొడమ 104

వ. ఇట్లనియె. 105

ఉ. భాగ్యము గాదె యక్రమమ పన్నగకంకణుచేఁ దపఃక్రియా
యోగ్యతఁ జేసి విశ్వభువనోపకృతిప్రతిపాదనైకసౌ
భాగ్యధురంధరం బయినపాశుపతాస్త్రము గాంచి తింక వై
రాగ్యము పుట్టుఁ గాక కురురాజుపయి న్నిజరాజ్యలక్ష్మికిన్ 106

వ. నీవు నారాయణసఖుండవై నయాదిమునీశ్వరుండవు. నరనారాయణులవలనఁ ద్రివిష్టపంబునకుఁ బెక్కుతోయములు రాక్షసబాధలు శాంతిం బొందె, నిప్పుడు హిరణ్యపురనివాసులు నివాతకవచకాలకేయాదు లగుదైతేయులు రాజ్యలుబ్ధులై నాకంబునకనేకప్రకారంబుల నుపద్రవం బాపాదించుచున్నవారు వారిం బరిమార్ప నమరావతీపురంబునఁ గొన్నిదినంబులు ప్రతీపవాసప్రయాసఖేదం బపనయించి మధ్యమలోకంబునకుం గ్రమ్మఱ నేతెంచునది మాతలిసారథికం బగురథంబు పుత్తెంచెద

నిచ్చోటున యుండునది యని తత్కాలసన్నిహితుం డైనరోమహర్షుం డను మునిం జూచి నీవు ద్వైతవనంబునకుం బోయి పాండవుల కర్జునకుశలవార్తయుం బాశుపతాస్త్రలాభంబును స్వర్గగమనంబుం జెప్పు మని పల్కి యింద్రుండు నిజస్థానంబున కరిగె. 107

గీ. విశ్రమించె నొక్కవృక్షంబు క్రీనీడ, నర్జునుండు మణిశిలాంతరమున
ఖండపరశుబాహుదండనిష్పీడన, ముష్టిఘాతఖేదమోక్షమునకు 108

శా. మౌళిం గోహళిసంఘటించినక్రియ న్మధ్యాహ్నవేళ న్మహా
కాశం బైననభోవిభాగమున వీఁకం గాసె బీరెండయా
ప్రాలేయాహితసంప్రదీప్తకిరణప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీవాచాలకోయష్టి యై. 109

వ. అప్పుడు మధ్యాహ్నకాలపూజకు నాయితంబై. 110

సీ. పావననిర్ఝరాంభఃప్రవాహంబున, నఘమర్షణస్నాన మాచరించి
కసటువోఁ దెలినీటఁ గడిగి యాఁటార్చిన, సలిలకాషాయవల్కలము గట్టి
యాపాదమస్తకం బఖిలాంగకంబులఁ, గమ్రనిభసితంబు గలయ నలఁది
పెడఁదముత్యములతో నెడవెట్టి గ్రుచ్చిన, మంచిరుద్రాక్షదామములు దాల్చి
గీ. పులికళాసంబుగద్దెపైఁ బూనికి మెఱయఁ, బంచశుద్ధులు గావించి పాండుసుతుఁడు
షోడశోపచారంబులు సారిదిఁ దీర్చె, నీలగళునకు మధ్యాహ్నకాలవేళ. 111

వ. ఇట్లు శివలింగార్చనంబు దీర్చి కందమూలఫలోపహారంబులు సమర్పించి తత్ప్రసాదంబునఁ దాను దేహయాత్ర నడపి విశ్రాంతుం డై యున్నసమయంబున ధవళహయసహస్రంబులఁ బూన్చినరథంబు గొని వచ్చి మాతలి తనకుం బొడసూపిన సబహుమానంబుగా నాదరించి పురందరాదేశంబున నద్దివ్యస్యందనం బెక్కి యాకాశమార్గంబునం జనునప్పుడు. 112

సీ. ఇదిమేఘమండలం బివి విమానంబులు, యక్షవిద్యాధరోపాశ్రయంబు
లిదియావహస్కంధ మదె తారకావీథి, యల్లతెల్లనిరేఖ యభ్రగంగ
యల్లదె శింశుమారాకారహరిమూర్తి, వీఁడె భాస్వంతుఁడు వాఁడె ధ్రువుఁడు
వీర సప్తర్షులు వారె యశ్విన్యాదు, లిరువాడ దేవేరు లిందుభార్య
గీ. లల్లవాఁడె సుధాకరుం డవె గ్రహంబు, లివ్వలాఖ్యంబు లగుచుక్క లివె కెలఁకుల
ననుచు మాతలి చూపంగ నర్జునుండు, కౌతుకం బంది గగనమార్గంబునందు. 113

శా. జంభారాతితనూజుమీఁదఁ బొలిచెన్ సావిత్రివర్త్మంబున
న్సంభిన్నోదరశాతకుంభనలినీనాలీకసంవాసనా

సంభారంబులు సోఁడు ముట్ట సవిధస్వర్లోకకల్లోలినీ
గంభీరాంబుతరంగసంభ్రమములం గల్యాణవాతూలముల్. 114

గీ. అర్జునునిమీఁదఁ బొలిచెఁ బథ్యంతరమున, నభ్రగంగానదీతరంగానిలంబు
నందనోద్యానవీథికానవలతాంత, సారభాసురహారినీలహార మగుచు. 115

వ. ఇవ్విధంబున మాతలిసారథికం బైనయారథంబుమీఁద నక్షత్రమండలం బోఁటి
పోనుచుం జని యర్జునుం డమరావతిం బ్రవేశించి దివ్యాంగనాపాంగభంగిసమాలింగిత
సౌభాగ్యుం డై రాజమార్గంబునం జని దివ్యమందిరంబుఁ బ్రవేశించి సుధర్మాభిధానం
బైనయాస్థానమండపంబునఁ గొలువున్నమహేంద్రు నర్ధాసనంబున నుండె. 116

గీ పీఁడుపట్టుగ మందారవిపినవీథి, దివ్యసౌధంబునందుఁ బ్రతిష్ఠఁ జేసి
గారవించె జయంతకుమారకంబుఁ, బాండురాజతనూజు నాఖండలుండు. 117

వ. ఆనిశాసమయంబున. 118

సీ. పదువాల్గుజాతుల త్రిదశాంగనలయందుఁ, బేరుఁ బెంపును గలనీరజాక్షి
నీరజనాభునియూరుకాండంబున, నుద్భవం బందినయుజ్జ్వలాంగి
యంభోనిధానంబు నాపోశనము గొన్న, కలశసంభవుఁ గన్నకంబుకంఠి
వసుధయందుఁ బురూరువశ్చక్రవర్తికిఁ, బ్రాణవల్లభ యైనపద్మనయన

గీ. కట్టి తోఁడి పూసి కై సేసి కౌతుకమునఁ, గొస దిగఁగ నీలిపుట్టంబు ముసుఁగువెట్టి
గాజు లెగఁ ద్రోసి చప్పుడు గాక యుండ, వచ్చె నూర్వశి యర్జునావాసమునకు. 119

చ. విమలసుధాంశుకాంతమణివేదికపై నవహంసతూలత
ల్పమున సుఖప్రసుప్తిపరిపాకము నొంది విశాలనేత్రప
ద్మములు మొగిడ్చి శేషఫణిపైఁ బవళించినయంబుజాక్షు భా
వమునఁ గరంబుఁ బొల్పనురువానిఁ గనుంగొనె నింతి పార్థునిన్. 120

గీ. మేల్కొలిపి యిందుబింబాస్య మెల్ల మెల్లఁ, బ్రమదనిద్రాపరాధీను పాండుతనయుఁ
బగడములఁబోలుతనపాణిపల్లవములు, నతనిమృదుపాదపంకేరుహంబు లొత్తె. 121

వ. మేల్కని యర్జునుండు నిర్జరలోకలలామం బైనయప్సరఃస్వామినీరత్నంబుం గనుంగొని
పాన్పు డిగ్గి యభివాదనంబు సేసి వినయవినమితోత్తమాంగుం డై యి ట్లనియె. 122

గీ. ఈనడికిరేయి నొంటిమై యింతదూర, మేమి కార్యంబు మదిఁ గోరి యేగుదెంచి
తేను రమ్మన్న రా నె పూర్ణేందువదన, చెప్పుమీ పాన్పుమీఁద విచ్చేసియుండు. 123

ఉ. ఆడఁగఁబోవుతీర్థ మెదు రైనవిధంబున నిల్లి రేయు రే
పాడియ చంద్రశేఖరు నుపాస్తి యొనర్చి యుపాయనంబుతోఁ
జూడఁగవచ్చువాఁడ నయి చూచుచు నుండఁగ నీవ వచ్చితో
చేడియ యెట్టిపుణ్యములు చేసినవాఁడనొ ప్రాగ్భవంబునన్. 124

శా. మత్తారాతివిదారణుండు జనసమ్మాన్యుండు సీతాంశువం
శోత్తంసంబు పురూరవుండు ప్రచలద్యోగుండు మాతాతగా
రత్నాకరమేఖలాపతికి నిల్లా లైతిగా కావున
న్మత్తో నీ విది లెస్స మన్ననిపయి న్మోహంబు వాటింపఁగన్. 125

గీ. ఆదినారాయణునియూరు వంబుజాక్షి!, భువనవిఖ్యాత మైననీపుట్టినిల్లు
పావనుఁడ నైతి నీపాదపద్మములకు, వందనముఁ జేసి వరభక్తిప్రభవమున. 126

వ. అని పెక్కుప్రకారంబుల నిర్వికారుండై పాండుకుమారుండు ప్రియంబు చెప్పిన నప్పువ్వుఁబోఁడి కప్పలుక్కు లొప్పు లయ్యును నీరుడప్పికి నేయునుంబోలి యప్పటి కప్రియంబు లైయుండె నిచ్ఛావిఘాతంబు నొందియు నమ్మచ్చెకంటి చేతోభవవికారంబు హరింపం జాలక ధనంజయున కిట్లనియె. 127

గీ. ఏల యొన్నొతరంబుల నీడఁ బడ్డ, పెద్దవావులు శోధించి గుద్దలింప
వారకాంతాజనములకు వావి గలదె, మాను మర్జున మొగమోట లేనిమాట. 128

ఉ. వాసవునిండుఁగొల్వునకు వచ్చినయప్పుడు తత్సమంచితా
ర్ధాసన మెక్కియున్ననిను నంగజసన్నిభుఁ జూచి పుష్పబా
ణాసనుపుష్పబాణనివహమ్ములకుం గురి యైతి నిట్టినా
యాస నిరాకరింపఁ దగవా మగవాఁడవు కావ యర్జునా! 129

గీ. ప్రమద మెసలారఁ బాంచాలరాజసుతకు, వలచి చేసితివో సత్యవాక్ప్రతిజ్ఞ
యన్యకాంతలదెసఁబోవ ననుచు నీవు, భామలకుఁ జేయుసత్యంబు పాడిగాదు. 130

క నామోహము నావేడుక, నామానము నాప్రియంబు నాతగులము నా
ప్రేమమ్మును నాతెగువయు, క్షామముఁ బొందంగ నూరకయె పోవుదు నే. 131

చ. అతులితధైర్యశౌర్యమహిమాద్భుతసాహసు లై మహోగ్రతా
ప్రతతనిశాతనిష్కృపకృపాణవిదారితదేహు లై రణ
క్షితిఁ బడినత్తు రైదుపదిసేయక నాకయి యుట్టినన్ను నీ
వితరులఁ బోలెఁ గైకొనక యేఁచెద వక్కట పాండునందనా!. 132

క. వేసాలఁ బోకు రమ్మా, మూసజ్జకుఁ బ్రొద్దుపోయెఁ బులియుట చాలుజ్
వాసవనందన! కుసుమశ, రాసనకేళీకలావిహారంబులకున్. 133

వ. అని పల్కి యంత నిలువక బ్రహ్మచర్యవ్రతదీక్షాపరాయణుండవె నీ వనుచు నారాయణోరుస్తంభంబున సంభవించినయయ్యచ్చరలేమ లేమొలకనవ్వు లపాంగంబునం దొంగలింపఁ గంకణఝణఝణత్కారంబు తోరంబుగాఁ గెంగేలికేళీకమలంబునఁ బరాగరేణుత్రసరేణువిసరంబులతోడం గూడి మకరందబిందుధారాస్యందంబు చిందఁ

బురందరనందనుని ద్రోసి ప్రేపిన నత్యంతధీరోదాత్తుండు గావునఁ జిత్తభవసమ్మోహనాస్త్రవిదారణంబునకుం దార యగునవ్వేటున నంతరంబున మిసిమింతుండును గాక యేపాకంబునకు రాక రాకాచంద్రబింబంబువోని సెమ్మోము వాంచి నిర్వికారుండై యూరకుండె నివ్విధంబున నయ్యూర్వసియుఁ బసిమాలఁ బెనంగి యక్కిరీటిచిక్కని మనంబుఁ బక్కగానక కానక కాసినవెన్నెలయుంబోలెఁ దనకన్నులవలపు మిన్నకి పాలివోయినం జిన్నవోయి నిట్టూర్పులు నిగిడించుచు మనోరథవిఘాతప్రభవం బైన కోపంబు సైరింపక నరు నుద్దేశించి నపుంసకుండవుఁబోలె నాన గొన్నాఁడ వేఁడు కాలంబు నపుంసకుండవు గమ్మని శపించి దిగ్గన లేచి మొగంబు గంటువెట్టుకొని యింటికిం బోయె. యుధిష్ఠిరానుజుండును వసిష్ఠజననివలన గతికీర్తితాపన్నుండై యయ్యూరిష్టంబునకు సంతాపంబు నొందక యది విధివశంబుగాఁ దలంచుచుండె నప్పుడు గగనంబు క్రేవంబడి యస్తమండలుండై హిమగభస్తి విరహవేదనాదూయమానమానస యగుమైత్రావరుణజనయిత్రి ఖిన్నవదనంబునుంబోలె వెలవెలఁ బాఱ విభావరీసమయంబునం ద్రిభాగావశేషం బగుటయు. 134

సీ. పారిజాతకలతాపల్లవంబులు మేసి, కొసరె నుద్యానపుంస్కోకిలములు
గంధరాగ్రైవేయకనకఘంటిక మ్రోయ, వేల్పుటేనిక యుపరివ్వీధికి వెడలె
మందాకినీవీచిమారుతం బల్లార్చె, నప్సరస్త్రీనిలనీలాలకముల
సప్తర్షిపావనాశ్రమవనాంతరమున, నామ్నాయఘోష మభ్యధిక మయ్యెఁ

గీ. బాలవత్సంబుపైఁ గూర్మి బచ్చడిలుచుఁ, గామధుగ్గవివచ్చుహుంకార మెచ్చె
శుక్రుగడియారమున మించె శంఖరవము, విబుధలోకంబునందలి వేగుఁబోక. 135

గీ. మర్త్యలోకంబువారిప్రమాణసంఖ్యఁ, బొందుసూనుండు గడపెను వజ్రియింట
సగము నిద్రయును సగము జాగరమును, నావిభావరి వేగుఁబోకాఱునెలలు 136

సీ. మాటుగా వైచినమాంజిష్ఠతెర యెత్తి, పంజుమంచము డిగ్గె మంజుఘోష
ముకురిమట్టెలమ్రోఁత ముద్దుచూపఁగ రంభ, కనకంపుగోడుగు పాగాలు దొడిగె
నొకటవేనలి ముడ్చి యొక్కకేల ఘృతాచి, గాజుటెక్కలతిల్వ గడియవుచ్చె
నలసభావముతోడ నలవోక ప్రమ్లోచ, నిల్వుటద్దంబులో నీడచూచె

గీ. హారిణి గీలించె నలినపట్టాంశుకంబు, మేనక ధరించెఁ బాలిండ్లమీఁద ఱవిక
యప్సరస్త్రీనికేతనాభ్యంతరములఁ, గొక్కొరోకో యటంచును గోళ్లు గూసె. 137

ను. అమరావత్యమృతాశనుల్ప్రథమసంధ్యావేళ వాల్గన్నులం
గమలాప్తుం గని యాచరించిరి నమస్కారంబు క్రిందైనమ
ధ్యమలోకంబున దీవ్యదంశువుల నీహారప్రతానంబు భం
గమునొందించుచు మిన్నుఁ బ్రాఁకె నుదయగ్రావప్రదేశంబునన్. 138

సీ. పరమర్షిపావనపాణిపల్లవములు, ఫాలభాగములపైఁ బవ్వళింపఁ
బౌలోమిపెంచినబాలకోకద్వయం, బలఁతియారెండకు నట్టు సాఁప
గగనకల్లోలినీకనకపద్మములపైఁ, దుమ్మెద లెగసి ఝుం ఝుమ్ము రనఁగ
నాకవిద్యాధరీనాట్యశాలలయందుఁ, దూర్యత్రయంబులు దురఁగలింపఁ

గీ. బ్రమద దిక్కాంత కెంగేలఁ బట్టియాడు, క్రొత్తగురివెందపూసలగుత్తివోలె
దివసకామిని ముఖలక్ష్మి తెలివి నొందఁ, బూర్వదిశయందుఁ గరకరఁ బ్రొద్దు వొడిచె.

వ. అయ్యవసరంబున. 140

శా. కాల్యాచారము లాచరించి కడఁకం గౌరవ్యశార్దూలుఁడా
జ్జ్వల్యస్ఫూర్జితవస్త్రభూషణ విశేషస్ఫూర్తియై విస్ఫుర
న్మాల్యాలేపనుఁడై విచిత్రబలశుంభద్భవ్యదివ్యాస్త్రసా
ఫల్యప్రౌఢతపోనిరూఢవిభవభ్రాజిష్ణుఁడై యున్నతిన్. 141

క. బలవదరినికరనిర్భర, బలసాదనబాహుదర్పబంధురలీలా
విలసత యొసఁగ వచ్చెను, బలసూదనుసభకు భక్తిభావం బలరన్ 142

వ. వచ్చిన సాష్టాంగం బెరఁగినఫల్గును నఫల్గునవాత్సల్యహేలాసముత్సేకంబున గాఢగూ
హనసంభావితుం జేసి జంభభేది యతని నాత్మీయసింహాసనార్ధంబున నుపవిష్టుం గావిం
చి యిట్లనియె. 143

సీ. బాహాబలాటోపపరిపాటి మెప్పించి, పడసితి వీశానుపాశుపతము
సంగ్రహించితివి శస్త్రిమ్ము లిమ్మడిగాఁగఁ, బురవైరికరుణ నిర్జరులవలన
నధికరించితి విస్మదాచార్యకంబునఁ, జతురంబులగుదివ్యసాధనములు
కొలఁది తేకుండఁ గైకొంటి కుంభజుచేత, నైజంబుగాఁ జాపనైపుణంబు

గీ. పరశుపట్టిసముద్గరప్రాసముసల, ఖడ్గముఖచిత్రచంక్రమక్రమనిరూఢిఁ
గరము మేదిని సాటి నీ కరయఁ గలరె, శౌర్యమున నుగ్రభుజవీచి సవ్యసాచి. 144

శా. ఏరీ నిన్నెదిరింపఁగా జగమున న్వీరు ల్ప్రతాపోద్ధతిం
ధౌరంధర్యమునం బ్రభావమహిమం ధైర్యంబునం జాపలీ
లారంభంబున సాహసిక్యమున బాహాశక్తి దివ్యాయుధో
దార ప్రౌఢిమ దేవదైత్యనరగంధర్వాదిసంఘంబులన్. 145

క. నీ వని సేయ బలాఢ్యుఁడ, వీవిశ్వంబునను నీకు నెదు రెవ్వరు లే
రావంతి యైన వదలకు, మేవలనను దేవవిప్రహితకార్యంబుల్. 146

క. ఏవున భుజగర్వోన్నతి, ప్రావున దీపింప నిట సుపర్వహితార్థం
బోపార్థ! చేయవలయును, నావనిచినపంపుపంపున న్శౌర్యనిధీ. 147

చ. అలఘుబలు ల్నివాతకవచాఖ్యులు వీరులు ఘోరదానవు
ల్జలనిధిఁ గొంది నుండుదు రసాధ్యులు నిర్జరసిద్ధసాధ్యకిం
పురుషనరకిన్నరద్యుచరనాయకకోటికి మూఁడుకోట్లవా
రలవలనం గలంగెడు నిరంతరబాధల ముజ్జగంబులున్. 148

చ. మఱియును నెందఱేని నసమానబలు ల్సురలోకకంటకు
ల్దఱిమఁగ బాధ చేసెదరు దైత్యు లవధ్యులు నిర్జరాళి కే
ర్పఱిచె నెఱయంగ వీరభవదీయశరార్చులపాలు సేసి యం
దఱి నుఱుమాడి యెంతయు హితం బొనరింపుము మాకు నర్జునా. 149

వ. అని సునాసీరుండు సమారాధనంబున. 150

క. తనతొడిగినభూషణంబులు, తనదుకిరీటము నభేద్యతరకవచంబుం
దనుతున నొసఁగ గాండివ, ధనువున నగజయము గుణము దాఁచి కడంకన్. 151

క. హయము లనూరుసవర్ణము, లయుతంబు వహింప సూతుఁ డై మాతలియు
న్నియమింపఁ దవరునరదము, నయుదము నెక్కంగఁ బనిచి వార్షం బెసఁగన్. 152

గీ. అమరలోకంబు నిర్జింప ననుపఁ బొంగి, సంగరోత్సాహ మెదలోన సందడింప
నడరు పెంపున నరుగునయ్యర్జునునకు, నిర్జరులు హర్షమున నిట్లనిరి కడంగి 153

సీ. ఈరథం బెక్కి మున్నింద్రుండు నిర్జించె, శుంభన్మహాసైత్యు జంభదైత్యు
నీశతాంగమున బర్హిర్ముఖేంద్రుఁడు ద్రుంచె, నాజిని స్తంద్రు వృత్రాసురేంద్రు
నీయరదంబున నెగిచె గోత్రవిభేది, పరిపంథిఘనమహాబలుని బలుని
నీతేరఁ గాడ మాయించె సుత్రాముండు, పాకదైతేయు నిర్భయసహాయు

గీ. నీమహాస్యందనంబున నేపుమాపె, నముచిముఖదానవశ్రేణి నమరవిభుఁడు
నీవు మాతంద్రియట్లన నిఖిలదనుజ, పతుల నోర్వుము దీనిచేఁ బాండవేయ. 154

వ. అని పల్కి దేవసంబంధం బైనదేవదత్తం బనుశంఖ బిచ్చినం బుచ్చుకొని యర్జునుండు మాతలియుం దానును దద్రథాధిరోహణంబు చేసి నివాతకవచవధార్థం బతిరభసంబున నరుగువాఁడు ముందటఁ గరిమకరకరకఠోరఫూత్కారవారిధారాలవాపారపూర్యమాణ రోదసీనిరంతరాకాలసంపాదితోడుభ్రమంబును నమలడిండీరపిండఖండమండితాఖండ పాండుగ్యధుర్యగోచిరనిశాసాంద్రచంద్రికాక్రాంతదేశదిశాభాగంబును వితతవిద్రుమ లతానికుంజపుంజసముభిరంజితప్రదేశనిర్దిష్టసంతతాదిష్టచరమసంధ్యావిశేషరాగంబును గమఠఝషకుళీరతిమితిమింగిలాదిసత్త్వసంపాతసంభృతాచ్ఛోదితధ్వనినిలీనవిఖిలచేతనా రవంబును దటవిధూతపాతనికిరదవిరళపరాగవినిర్భృతద్విరేఫకుసుమమంజరీవిశాలలవలీ లవంగలుంగలతాలాస్యవిభవంబును బతుభూభృదవిరతప్రచారాభిమవణంబును నమేయ

వాహినీవధూముఖప్రసక్తభూషణంబును నగుమహాసముద్రంబు డగ్గఱి తదీయోద
రంబున. 155

చ. కనియెఁ బురంబు నభ్రమణికాంచనసౌధము నత్యుదగ్రసా
ధనము నసాధ్యశిల్పఘనదారుణసాలము నద్భుతైకస
జ్జనసముదగ్రఘట్టము విశాలతరాట్టము నుద్భటారిత
ర్జనము ననల్పగర్జనసురద్విషదుజ్జ్వలితంబు నిమ్ముగన్. 156

మ. కని యత్యుద్ధతి శంఖ మొత్తుటయు నాకంపించె ధాత్రీతలం
బనిలస్కంధము లేదు చిక్కువడియె న్యాదోనిధు ల్డిందె ఘూ
ర్ణనముం బొందె సురేంద్రలోకములు విన్నంబోయెఁ బాతాళము
ల్వనియోగంబులు దప్పె భూతచయము ల్వ్రీలె న్దిశాభాగముల్. 157

వ. ఇట్లుయుగవిగమసమయఘనఘనాఘనవకఠోరదీర్ఘతరశతసహస్రభైరవం బగునమ్మహా
రవంబు కర్ణశూలం బై తాఁకినఁ గనలి దానవులు హలముసలపరశుపట్టిసప్రాసపరిఘా
ముద్గరముసుండిదండకోదండకుంతకులిశభల్లభిందివాలశంఖశక్తికర్తరీకరాఠకురాఠలవి
త్రతోమరత్రిశూలఖట్వాంగచక్రచంద్రహాసనుహాంకుశగదాపాశపాషాణప్రముఖం
బులగు మహాస్త్రశస్త్రంబులు వహించి వికటగర్జారవభరంబున నంబరంబు పిక్కటిల్ల
నొక్కపెట్ట యమ్మహానగరంబు వెడలి తదీయస్యందనంబుఁ జుట్టుముట్టి. 158

మ. ఘనశస్త్రాస్త్రమహాతివర్షము నొగి న్గర్జామహాడంబర
ధ్వనిసంవీతఘనాఘనౌఘనిపతద్ధారాళధారామహా
శనివర్షంబులద్వంద్వ మొందఁ బయిపై సంరంభశుంభదతి
న్వనధుల్ ఘూర్ణిల బిట్టు వాసవిపయి న్వర్షించె నొక్కుమ్మడిన్ 159

క. వాలికొమెఱుంగుఁదూపులు, నాళీకోదరునిమఱఁది నలిదైత్యులపైఁ
గీలించెఁ బేరుపేర, న్వాలమునఁ బదేసికంకపత్రములు వడిన్. 160

మ. అలుకం దానవు లొక్కయుమ్మడి తదీయస్యందనోరుద్యుతి
స్థలనంబు న్సురసిద్ధచారణమహాశ్చర్యంబు గావించుచు
న్గలహక్షోణియు నాకసంబు దిశలుం గాండప్రకాండంబులం
గలయం గప్పి యదల్చి యార్చిరి సమాకంపింప భూతావళుల్. 161

గీ. భయభరంబున వెలవెలఁ బాఱి రపుడు, త్రిదశసారథి ధృతి దప్పె తేరుగడుప
భ్రమసియుండినఁదాన సారథియు రథియు, నగుచుఁ బరిమార్చె నరికోటి నర్జునుండు.

క. నిర్జరసారథి యర్జును, దుర్జయవిక్రమము సమాదోహలతయు దోగ
ఖర్జాభరంబు సారథి, యార్జిత్యముఁ జూచి మిగుల హర్షముఁ బొందెన్. 163

సీ. అసురు లుద్ధతిశూలహలభిందివాలంబు, లడరించి రడఁగించె నర్జునుండు
దైత్యులు దండించి దండకంకులశక్తు, లిగిడించి రుడిగించె నింద్రసుతుఁడు
దైతేయు లేచి ముద్గరగదాంకుశములు, పఱపించి రదలించె ఫల్గునుండు
సురవైరు లల్కఁ దోమరకుంతగుణములు, సారించి వెడలించె సవ్యసాచి
గీ కణయకంపరఖేటకక్రకచకులిశ, చక్రఖట్వాంగకుద్దాలచంద్రహాస
వివిధశస్త్రాస్త్రతతులు వైచి రవఘళించె, శుక్రశిష్యుల ద్రోణశిష్యుండు గెలిచె 164
వ. ఆయ్యవసరంబున 165
శా. జంభారిప్రభవప్రయుక్తనిబిడజ్యారావగంభీరసం
రంభభ్రామితగాండివప్రసరదస్త్రవ్రాతదీవ్యత్పరా
సంభిన్నాంగములై సురారితనువు ల్సంగ్రామరంగంబునం
గుంభద్రోణములట్ల బిట్టు గురిసెం ఘోరంబుగా రక్తముల్. 166
క. చేయునది లేక దనుజులు, మాయాయుద్ధంబు సేయ మదిఁ దలఁచి ధృతిం
బాయక వైచిరి విద్యా, వైయాత్యము మింపఁ బరుషవర్షాస్త్రంబుల్. 167
వడిఁ బాము వ్రేలఁగట్టిన, పడువున నలుగడల ముసరి వార్వాహంబు
ల్జడివడి కురియం దొడఁగెను, వెడవెలుపును లేక పాండవేయునిమీఁదన్. 168
మ. బలభిద్ధ్వంసికరంబునం గొనినదివ్యన్మారుతాస్త్రంబుచే
జలవాహంబులు పట్టఁజేసె నరుఁ డత్యుగ్రప్రతాపంబున
న్గలయం గప్పిరి దారుణాశ్మముల నుగ్రస్వాంతులై యేచి దై
త్యులు పార్థుం గులిశాస్త్ర మేసి యవి తోడ్తోఁ ద్రుంచె నాతం డొగిన్. 169
చ. అనలసమీరణాత్మకము లైనమహాస్త్రము లేసి రుద్ధతిం
దనుజులు గాడ్పుతోఁ బెరసి నల్గడ నొక్కట విస్ఫులింగము
ల్గనకనఁ గ్రాలఁ బావకశిఖ ల్వెస ముంచె సురేంద్రనందను
న్ననలి యతం డణంచె నవి గ్రక్కున వారిమహాశుగంబులన్. 170
చ. తిమిరమహాస్త్ర మేసి రణతీవ్రత నూపిరి దైత్యపుంగవుల్
క్రమమునఁ గప్పె నల్గడల గాఢమహోద్ధతిఁ జిమ్మచీఁకటుల్
తెమలె దిశావివేకమును ధీరతయు న్వెస నెల్లవారికిం
భ్రమసి సురేంద్రసారథియుఁ బాఱఁగ వైచెఁ బ్రతోద మవ్వలన్. 171
క. రథ్యములు పరవ నేరక, మిథ్యాభిమతంబు లయ్యె మియి మఱచి సమి
ద్రథ్యు ధనంజయుఁ గానక, తథ్యమునను లేక యుండఁ దత్సారథియున్. 172
వ. భయం బంది యర్జున యెటపోయె దని యెలుంగెత్తి యాహ్వానంబు సేసి తొల్లి దే
వాసురసమరంబు లనేకంబులు చూచితిం గాని యిట్టిభయోద్రేకజన్యంబు లగుజన్యం

బులు గూడ వీరు వరజనితవీర్యదర్పితులు గావున వీరిసంప్రహారంబు ఘోరంబు అని పల్కిన మాతలి నూఱడించియించుక నీవు మద్భుజావిహారంబు చూడు మని ఫల్గునుండు.

శా. జంభధ్వంసివరంబునం గనినయస్త్రంబు న్మహాసారముగ్
కుంభద్విక్రమబాహుదర్పములు సంక్షోభిల్ల నేసెం దమ
స్సంభారం బడఁగన్ దిశ ల్విపులమై శబ్దంబు నొందన్ సుర
ల్సంభావింప భయంపడంగ దివిజు ల్సంగ్రామగంగంబునన్. 174

మ. జవ మేపాఱఁగఁ గూలె దైత్యతనువు ల్సర్వంసహాపీఠిఁ బాం
డవగాండీవధనుఃప్రకాండభవకాండప్రస్ఫుటోచ్చండ తాం
డవపాండిత్యవిశేషవిభ్రమకృతాడంబప్రతీకంబులై
యవనీంద్రంబులభంగి నింగి యద్రువన్ హాహానినాదంబులన్. 175

వ ఇట్టినివాతకవచులు నిరవశేషులై మడసిన సంక్రందననందనుండు తత్పురంబులోనికిం జని యంతయుం గనుంగొని మాతలి కిట్లనియె. 176

గీ. కనకమయపట్టసట్టికుకాంత మగుచు, వివిధమణిసౌధములును వస్తువులు గల్గు
నిష్పురంబునఁ గాఁపుండ కితర మైన, పురమునం దేల నిల్చె నిర్జరవిభుండు 177

ఉ. నావుడు నిట్లనుం ద్రిదశనాయకుసారథి నిర్జరేశ్వరుం
డీవరాశిలోన సృజియించెను దైత్యభయంబుచేత దే
వావలి కుండ నిప్పుర ముదగ్రగతిం దనుసూను లంతరా
జీవభవుం బ్రసన్నునిగఁ జేసి మహాబలవీర్యవంతులై. 178

క. ఇంనుండఁగ నింద్రాదిక, బృందారకవరులతోడఁ బెనఁగుచ నెందున్
గ్రిందుపడకుండఁ దపమున, నందిరి వర మఖిలభువనహననోత్సుకతన్. 179

వ. కావునం దద్విజయార్థంబుగా విజయు నిన్ను వాసవుండు వనిచె, నిమ్మహాసురులు మఘ ద్గరుడగంధర్వసిద్ధసాధ్యుల కసాధ్యు లిట్టివారల నశ్రమంబునం జంపి పెంపు గాంచితివి భవదీయసత్త్వసాహసంబులకుం గొలఁది యెక్కడి యది యని యర్జునుం బ్రస్తుతించి మాతలిరథంబు గ్రమ్మఱించె ఇట్లు నివాతకవచులఁ బరాభవించి భవ్యతేజోదుర్నిరీక్షుం డై పాండవేయుండు మరలి వచ్చువాఁడు ముందట. 180

గీ. వివిధవృక్షగుల్మవిస్తీర్ణ మై కడుఁ, బొలుపుమిగులునొకతపోవనంబు
నతివిచిత్రశిల్ప మగుపట్టణంబును, నజ్జ్వలంబు లగుచు నున్నఁ గాంచి. 181

క. సురసారథి యిది యెవ్వరి, పుర మిమ్మహనీయఘనతపోవిపినం బె
వ్వరిది యిది న దుదృష్టికి, హరహర యతివిస్మయంబు నాపాదించెన్. 182

వ అనవుడు నమ్మహాత్మునకు నాతఁ డిట్లనుఁ దొల్లి పులోమియు గోవికయు ననుసురకాంత లిత్తపోవనంబున దివ్యసహస్రవర్షంబు లత్యుగ్రనియమంబునఁ బద్ధగర్భ

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| రసికజనమనోభిరామము, శుద్ధప్రతి .. | 0 | 8 |
| రుక్మిణీపరిణయము ,, ... | 0 | 6 |
| రాజశేఖరవిలాసము, కూచిమంచి. తిమ్మకవిది .. | 0 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవిప్రణీతము ... | 0 | 8 |
| అనిరుద్ధచరిత్ర, కనుపర్తి. అబ్బయామాత్యప్రణీతము ... | 0 | 8 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిప్రణీతము ... | 1 | 4 |
| నిరంకుశోపాఖ్యానము .. | 0 | 6 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ. వెంకమ్మప్రణీతము, చక్కనికూర్పు | 0 | 11 |
| పంచతంత్రము, నారాయణకవికృతము ... | 0 | 12 |
| జైమినిభారతము, అశ్వమేధపర్వము, చక్కనికూర్పు ... | 0 | 12 |
| ఉత్తరహరివంశము. సోమనాథకృతము .. | 1 | 4 |
| రుక్మాంగదచరిత్ర ఏకాదశీమాహాత్మ్యము ... | 0 | 8 |
| సులక్షణసారము, సటీక . | 0 | 8 |
| ఆంధ్రబ్రహ్మాండపురాణము ... | 1 | 0 |
| దసరాపద్యములు .. | 0 | 1 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, టీకానుక్రమణికాసహితము, కాలికోబైండు | 0 | 12 |
| అప్పకవీయము, చక్కనికూర్పు, అట్టబైండు .. | 1 | 6 |
| డిటో కాలికోబైండు .. | 1 | 10 |
| వేమనపద్యములు, చక్కనికూర్పు . | 0 | 4 |
| డిటో బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో ... | 1 | 0 |
| సప్తమస్కంధము, సటీక, చిన్నసైజు . . | 1 | 0 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) ... | 0 | 4 |
| డిటో ,, గట్టుప్రభువుకృతము ... | 0 | 6 |
| భోగినీదండకము, బమ్మెర పోతరాజప్రణీతము ... | 0 | 1 |
| గజేంద్రమోక్షము, సటీక, చక్కనికూర్పు . | 0 | 6 |
| రుక్మిణీకల్యాణము, సటీక, చక్కనిప్రతి | 0 | 6 |
| నలోపాఖ్యానము, సటీక, చిన్నసైజు . | 0 | 6 |
| నలచరిత్ర, ద్విపద . | 0 | 11 |
| రూపవతి, రాజపుత్రస్త్రీసాహసపుకథ, శ్రీ ఎస్.యం. ప్ర. నారాయణమూర్తిగారిది | 0 | 8 |
| శ్రీనాథునివీథినాటకము .. | 0 | 2 |
| రాజయోగసారము, ద్విపద . | 0 | 4 |
| కన్యాశుల్కము, శ్రీగురజాడ అప్పారాయకృతము . | 0 | 12 |
| కృష్ణానుమూరినాటకము, శ్రీసీతారామకవిగారిది . | 0 | 10 |
| ఆంధ్రవచనభాగవతము, 3 సంపుటములు . | 7 | 0 |
| సంగ్రహరామాయణము, సులభశైలి, శ్రీ శేషాద్రిశర్మకృతము ... | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు, శ్రీసీతారామశాస్త్రికృతము, సులభశైలి ... | 0 | 12 |

